గంగిరెడ్డి లక్ష్మీనారాయణ

# నా గొడవ

ఏర్చి కూర్చిన కవితల సంపుటి



## కాళోజీ

ప్రచురణ :





యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

# NAA GODAVA

SELECTIONS FROM KALOJEE'S POETRY



యువభారతి

ప్రచురణ : 23

ప్రథమ ముద్రణ : 3,200

సెప్టెంబర్ 9, 1974

ముఖపత్ర రచన :

శీలా వీర్రాజు

ముద్రణ :

విజయ శ్రీ ప్రింటింగ్ వర్క్స్,
బషీర్ బాగ్, హైదరాబాదు–500001.

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాదు–500003.

లేదా

యువభారతి కార్యాలయం

ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాదు–500001.

వెల : రు 2-00

సాహితీమిత్రులకు

రూపాయిన్నరమాత్రమే

# ఆత్మీయం

ఇది ఆత్మీయం. జ్ఞాపకాలకు, ప్రేరణలకు అక్షరరూపాన్నిచ్చే అరుదైన అవకాశానికి ఆనందిస్తూ, సవినయంగా మనవి చేసుకొంటున్న స్వగతం.

సూర్యునికి – ఉదయాస్తమయాలు లేవు. అవి, పరిభ్రమిస్తున్న భూమిపై ఉన్న మన భ్రాంతి మాత్రమే. రోజులు, సంవత్సరాల పేరిట, మనం గీసుకొన్న కాలపు కొలమానాలు – పరిసీమిత పరిధిలో వాస్తవాలు. నిజానికి అవసరాలు. కానీ, ఆదీ అంతూ లేక నిరంతరంగా నడిచే కాలానికి – ఇవి లెక్కకురావు. విశాల వ్యాప్తి ఉన్న ఈ విషయం – వ్యక్తిపరంగా పరిశీలించవలసి వచ్చేసరికి, ఎంతో ప్రాముఖ్యాన్ని పొందుతుంది. ప్రతిరోజు, ప్రతి క్షణం, ఎంతో విశేషాన్ని సంతరించుకొంటాయి. 60 ఏళ్ళు, అంతకు పైగా, ఎందరో జీవించవచ్చు. కానీ, ఎంతకాలం జీవించారన్నది ముఖ్యం కాదు. ఎలా జీవించారన్నది ముఖ్యం ! తన తరంవాళ్ళను ఎలా ప్రభావితం చేసారన్నది ముఖ్యం ! తరతరాలకు ఏం మిగిల్చి వెడుతున్నారన్నది ముఖ్యం ! ఈ దృష్టితో – కాళోజీ సాధించినది, మనం హర్షించవలసినది చాలా ఉంది. అందుకే వారిని అభినందిస్తున్నాను. వారితో పరిచయం నా అదృష్టంగా భావించి, ఆనందిస్తున్నాను.

ప్రతి వ్యక్తి జీవితంలోనూ – ఏదో ఒక సందర్భం, ఏదో ఒక సంఘటన, ఏదో ఒక వ్యక్తి పరిచయం – చెప్పుకోదగ్గ మార్పుకు దారి తీస్తుంది. ఇలాంటి వన్నీ కలిసి – వ్యక్తిని తీర్చిదిద్దుతాయి ; వ్యక్తిత్వాన్ని సమకూరుస్తాయి. ఆలోచనలకు ప్రేరణ కలిగించి, ఆదర్శాలవైపు పయనించేలా చేసి, భవిష్యత్తును నిర్ణయిస్తాయి. నా జీవితంలో – కాళోజీ గారితో పరిచయం – అలాంటి పరిచయం, అరుదైన అదృష్టంగా , అపూర్వమైన విషయంగా, భగవత్ప్రేరితంగా, వరంగా భావిస్తాను.

యువభారతి ప్రారంభించిన నాటికి, కాళోజీ గారితో పరిచయ భాగ్యం కలుగలేదు – వారి కవితలతో తప్ప. ఆ తరువాత – 1964 లో కాళోజీ గారితో పరిచయం– క్రమేపీ చెప్పుకోదగ్గ చనువు, సాన్నిహిత్యం ఏర్పడ్డాయి. ఆయన మనస్సు అలాంటిది. మంచిగుణం అలాంటిది.

"చెమ్మగిలని కనులు బ్రతుకు కమ్మదనము చూడలేవు
చెమ్మగిలని కనులు బ్రతుకు కమ్మదనము చాటలేవు"

అంటూంటే – చెమ్మగిలే స్వభావం కల మనసు పొందే అనుభూతిని అర్థం చేసుకొని, స్వంతం చేసుకొన్నాను.

"అక్షర రూపము దాల్చిన
ఒకే ఒక్క సిరా చుక్క
లక్ష మెదళ్ళకు కదలిక" అన్నప్పుడు,

కత్తికన్న కలం పదునైనదనీ, బలమైనదనీ, లక్షల మెదళ్ళకు కదలిక, కోట్ల ఎద లకు ప్రేరణ కాగలదనీ బలంగా మనసులో నాటుకొంది.

"కలము కుంచె కదలాడెను
గళము తోడుగా పాడెను" అన్నప్పుడు,

అన్నీ కలిసి రావాలనీ, కదిలి రావాలనీ, ఐకమత్యం అవసరమనీ, సమ్యక్‌దృష్టి కావాలనీ - ప్రగతి వాంఛించే ఏ సమాజానికైనా కలము కుంచె గళము ముందుచూపుతో వ్యవహరించేవై ఉండాలని తెలిసివచ్చింది నాకు.

"రాయి రాయికి మధ్య పరాయితనము తగ్గింపగ
ఉడుత రాల్చినట్టి ఇసుక" మాదిరిగా అన్నప్పుడు,

"నిమిత్తమాత్రం భవ" అన్నట్లు - కృషి చేయడమే నా ధర్మం అని, నచ్చచెప్పింది.

"ఉదయం కానే కాదనుకోవడం — నిరాశ,
ఉదయించి అట్లానే ఉంటుం దనుకోవడం—దురాశ" అన్నప్పుడు,

నిరాశా నిస్పృహల మధ్య నిట్టూరుస్తూ కూర్చోకూడదనీ, దురాశల దురాలోచనలు చేయకూడదనీ, కాళోజీ కవిత నాకు నచ్చచెప్పింది. అందుకనే - యువభారతి ప్రచురణలలో సాధారణంగా కనిపించే "ప్రేరణ"లలో తరచుగా కాళోజీ మాట కనబడుతుంది. అందుకనే, నేనూ, యువభారతీ, మా కాళోజీకి ఋణపడి ఉంటాం.

మా అభిమానాలను, కృతజ్ఞతలను ప్రకటించుకునేందుకై ఈ శుభ సందర్భాన "నా గొడవ"ను అందిస్తున్నాం. కాళోజీని మనసార అభినందిస్తున్నాం.

"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని ఊరికే తిట్టుకుంటూ కూర్చోవడం కంటె - ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది" అన్న వాక్యంలోని భావం మా ఊపిరి. మా ఈ ప్రయత్నం, కొత్త ఊపిరు లూదాలని ఆశిస్తున్నాం. "మాటమ్మ" [ముఖే ముఖే సరస్వతి] నేడు నిండుగా ఆనందిస్తున్న రోజు. ఈ ఆనందంలో భాగం పంచుకోండని, సహృదయ తెలుగు ప్రజానీకాన్ని ఆహ్వానిస్తున్నాం.

సెలవ్.

వి. విశ్వనాథం

సెప్టెంబరు 9, 1974 సమావేశ కర్త

యువభారతి

# ప్రజాకవి కాళోజి

కాళోజి నారాయణరావు షష్టిపూర్తి సందర్భంలో ఆయన కవితాసంహితను మా యువభారతి ప్రచురించడంలో సందర్భ శుద్ధీ, శోభా రెండూ ఉన్నవి. కాళోజి సమకాలికులైన మావంటివారికి ఆయనకు షష్టిపూర్తి అంటే కొంత ఆశ్చర్యం కలుగుతున్నది. ఎందుకనగా సహాధ్యాయులైన నావంటి కొందరి దృష్టిలో కాళోజి ఇంకా యువకుడే. బాహ్య స్వరూపము మాట యెట్లున్నప్పటికిని ఆయన అంతరంగము యౌవనోద్రేక భరితం.

నాకు కాళోజితో మొదటి పరిచయం 1930 వ సంవత్సరమున. అనగా నలభై నాలుగు సంవత్సరాల క్రిందటిమాట. ఆ నాడు కాళోజితో సహవాసము చేసిన వారెవరూ ఆయన తెలుగుకవి కాగలడని అనుకోలేదు. కారణం ఆనాటి ఆయన వివిధ వ్యాసంగాలే. 1930 సంవత్సరంలో ఆయన హనుమకొండ హైస్కూలులో ఇంగ్లీషు మీడియం నాలుగవ ఫారంలో ప్రవేశించినపుడు ఆయనకు తీవ్రమైన సాంఘిక రాజకీయ అభిప్రాయాలు ఉండేవి. అంతకుముందు హైదరాబాదులో చదువుకొని, ఉర్దూ, మరాఠీ భాషలలో తగినంత ప్రవేశము సంపాదించి, ఆర్యసమాజములో కొంతకాలము ముఖ్యకార్యకర్తగా పనిచేసిన ఉత్సాహముతో కాళోజి హనుమకొండ రంగ ప్రవేశం గావించి, స్థానికంగా రాజకీయ సాంఘికఉద్యమాలతో సంబంధాలు కల్పించుకొని యువనాయకుడుగా రూపొందినాడు. ఆనాటి ఆయన వేషభాషల్లో ఆర్యసమాజ ఆదర్శాలు ప్రతిబింబించేవి. విద్యార్థిగా ఉంటూనే ఆయన స్థానికులైన పెద్దలతోనే కాక రాష్ట్రస్థాయి నాయకులతోకూడ సమానంగా మెలగుతూ దేశసేవ చేస్తుండేవాడు. చిన్నవయసులోనే కాళోజి అఖిల హైద్రాబాదు నాయకస్థాయిని అందుకో గలిగినాడు.

ఆనాటి ముఖ్యమైన రాజకీయోద్యమము ఆంధ్రోద్యమము : తరువాత యీ ఆంధ్రోద్యమము కాంగ్రెస్ కమ్యూనిస్టు ఉద్యమాలుగా చీలిపోయినది. ఆంధ్రోద్యమ, కాంగ్రెస్ ఉద్యమాలతో గాఢసంబంధము కలిగిన కాళోజి ఆనాటి జాతీయోద్యమా లన్నింటిలోను పని చేసినాడు. ఆంధ్రోద్యమం ఆయనను తెలుగు సాహిత్యానికి, సంస్కృతికి దగ్గరగా తీసుకొనివచ్చినది. ఆనాటి జాతీయోద్యమంలో ప్రముఖమైనది గ్రంథాలయోద్యమం. గ్రంథాలయ వార్షిక సభలలో పాల్గొనిన తెలుగు కవి పండితుల సహవాసము కాళోజి కవిగా అవతరించడానికి దోహదం చేసింది. గాఢమైన దేశాభిమానం, భాషాభిమానంతో పాటు ఉత్సాహమూ, ఉద్రేకమూ తొణికిసలాడే హృదయం కలిగిన కాళోజి సహజంగానే ఒక్కమారు కవియైనాడు. ఆ కావడం సాధారణమైన కవి గాదు ; ప్రజాకవి యైనాడు. చిన్నప్పటినుండి స్వాతంత్ర్య భావ పూరితుడై వివిధ జాతీయోద్యమాలచే ప్రభావితుడైన కాళోజి డెందమును ఒక్కమారు కందళింప జేసినది.

నాయకుడు కావలసిన వ్యక్తి అదృష్టవశాత్తూ కవి యైనాడు. క్రమక్రమంగా రాజకీయ రంగాలలో విజృంభించిన శక్తులమధ్య యిముడలేక కాళోజీ పూర్తి సమయాన్ని సాహిత్యానికి వినియోగిస్తున్నాడు. కాళోజీతో చిన్నప్పటి పరిచయం కలిగిన నావంటివాని దృష్టిలో యిది సహజ పరిణామమే - వాంఛనీయమైన పరిణామమే.

కాళోజి యెక్కడ ఉన్నా యేమి చేసినా ఆయన ప్రజల మనిషి - ప్రజల గొడవే కాళోజి గొడవ. ఆయన కవితా సంపుటాలలోని ప్రతిపేజి ఇందుకు ఉదాహరణము. ప్రజల సమస్యలే ఆయనను కవిగా పలికించినవి. కాళోజి కవితా దర్పణాన్ని అవలోకించితే, గడచిన ముప్పది సంవత్సరాల జాతీయోద్యమాల ప్రతిబింబము, ఆ ఉద్యమాలచే ప్రేరితుడైన ప్రజాహృదయాల స్వరూపము యిందులో సమగ్రంగా మనకు కనిపిస్తుంటవి. కాళోజి తొలిరచన 1942 ప్రాంతంలో జరిగినదని చెప్పవచ్చును. నాటినుండి నేటికీ అనగా ముప్పై రెండు సంవత్సరాల కాలంలో యీ ప్రాంతంలో జరిగిన చరిత్ర అంతా కాళోజి కవిత్వానికి యితివృత్త మైనదని చెప్పవచ్చును. ప్రజల భాషలో ప్రజల హృదయాలను ప్రదర్శించిన నేటి తెలుగు కవి కాళోజీ. ఈ మార్గంలో యీయన అద్వితీయు దేమో!

నాకు బాగా జ్ఞాపకం ఉన్నది. 1946-48 మధ్యకాలం హైదాబాదురాష్ట్రంలో రజాకారు శక్తులు విజృంభించినప్పుడు కాళోజీ ఆ శక్తులను అన్నివిధాల యెదుర్కొన్నాడు. నల్లగొండలో "నాజీ శక్తుల నగ్న నృత్య మింకెన్నాళ్లు? పోలీసు అండను దౌర్జన్య శక్తులు పోషణంబొందే దెన్నాళ్లు?" అని గర్జించినాడు. ఈ గర్జన నాటి తెలంగాణ మంతా ప్రతిధ్వనించింది. నల్లగొండ జిల్లాలో నిరక్షరాస్యులైన రైతులు పొలాలలో నాట్లు వేస్తూ, కలుపుతీస్తూ యీ గేయాన్ని ఆలపించిన సంఘటన లెన్నో ఉన్నవి. ఒక్కమారు కాళోజి కవిత్వాన్ని పరిశీలించండి. ప్రతిపంక్తిలో ఆయన హృదయాన్ని పోల్చుకోవచ్చును. ఇంచుమించుగా ఇదేకాలంలో వరంగలు కోటలో రజాకార్లు మొగలయ్య అనే కాంగ్రెస్ కార్యకర్తను పట్టపగలు దారుణహత్య గావించిరి. తరువాత పుండుమీద కారం చల్లినట్లుగా కాళోజి కొంతకాలం వరంగలు పట్టణములో ప్రవేశించరాదని నిషేధాజ్ఞను ప్రభుత్వము జారీ చేసింది. అప్పుడు సర్ మిర్జా ఇస్మాయిల్ హైదాబాదు ముఖ్యమంత్రి. మొగలయ్యహత్య జరిగిన కొన్నాళ్ళ తరువాత వరంగలుపట్టణం సందర్శించే కార్యక్రమం సర్ మిర్జా ఇస్మాయిల్ ఏర్పాటు చేసికొనగా కాళోజి హైదాబాదునుండి ఆయనకు వ్రాసిన కవితాలేఖ మన లేఖా సాహిత్యంలో చిరస్థాయిగా నిలువదగినది. ఆ లేఖలో కాళోజీ —

"కోట గోడల మధ్య ఖూని జరిగిన చోట-గుండాల శక్తులు గోచరించినవా?
బాజార్లో బాలకుని బల్లెంబుతో పొడుచు, బద్మాషు నేమైన పసిగట్టినావా?"
"మొగలయ్య భార్యతో మొగలయ్య మాతతో
మొగమాటమును లేక ముచ్చటించితివా?"

అని వేసిన ప్రశ్నలు ఆ నాటి తెలంగాణ మంతా మారుమ్రోగినవి. అప్పటి ప్రభుత్వము కొన్ని రాజ్యాంగ సంస్కరణలు ప్రవేశపెట్టగా ప్రజల సంస్థలు వానిని నిరాకరించినవి. ఆ సందర్భములో కాళోజి వ్రాసిన గేయము మన జాతీయ వాఙ్మయములో శాశ్వతంగా నిలువదగినది. అధిక సంఖ్యాకులైన హిందువులకు అల్పసంఖ్యాకులైన ముస్లింలతో నిజాం ప్రభుత్వము యిచ్చిన సమాన రాజకీయ ప్రతిపత్తి నిగూర్చి వ్యాఖ్యానిస్తూ కాళోజి "తొంబదితో పది సమమను తురకలెక్కడి యెన్నాళ్లు?" అని ప్రశ్నించినాడు. ఈ విధంగా జ్ఞప్తికి తెచ్చుకుంటే ఆనాటి కాళోజి గేయములు అసంఖ్యాకంగా ఉదహరించవచ్చును. ఇవన్నీ కాళోజి ప్రజల మనిషి, ప్రజాకవి అని అసందిగ్ధంగా ఋజువు చేస్తున్నవి గదా! (ఋజువే అవసరమైతే)

కాళోజి రచనలలో అడుగడుగునా ఒక విశిష్టత గోచరిస్తుంది. ఆ ప్రత్యేకతే కాళోజి ముద్ర. సంఘములోని వ్యత్యాసాలను గూర్చి వ్రాసిన గేయంలో "గట్టి దవడ లొకవైపు కమ్మని చకిలా లొకవైపు" అన్న పాదాలు ఇందు కొక మచ్చుతునక.

రెండవ ప్రపంచయుద్ధం తరువాత వచ్చిన ద్రవ్యోల్బణాన్ని గూర్చి "యుద్ధము మూలమున చలామణులకు ఉబ్బుల రోగము వచ్చింది" అన్నాడు కాళోజి — ఇది మరొక మచ్చుతునక.

కాళోజీకి బహు భాషలతో పరిచయ మున్నమాట సత్యమే. అయినా ఆయనను పండితుడని చెప్పడానికి వీలులేదు. అనేకవిషయాలను గూర్చిన అవగాహన ఆయనకు ఉన్నది. అయినా యే విషయములోనూ పారంగతుడని చెప్పడానికి వీలులేదు. స్వార్థాన్నిగూర్చి ఆలోచించక అన్ని జాతీయోద్యమాలలో పాల్గొనిన త్యాగమూర్తి ఆయన. అయినప్పటికిని ఆయనను యీనాటి పరిభాషలో నాయకుడని చెప్పడానికి వీలులేదు. దేశసేవకు జీవితాన్ని అంకితము చేసిన కాళోజి అన్నిటికన్న మిన్నగా కరుణార్ద్ర హృదయుడైన కవీశ్వరుడు. ఎక్కడ యే అన్యాయము జరిగినా ఆయన కండ్లనుండి జలజల నీరు రాలి గాయపడిన హృదయములోని భావాలు గేయరూపమున వెలువడును. ఆయనకవిత్వ మంతా యీ విధంగా ప్రకటితమైనదే. సమాజములోని వ్యత్యాసాలను, దౌర్జన్యాలను సహించే మనిషి కాళోజి కాదు. వీనిని వ్యతిరేకించడంలో వెనుకాడే మనిషి కాళోజి కాదు. ఆయన జీవితమంతా యీ మార్గములోనే నడిచినది. అందుచేతనే ఆయన నూటికి నూరుపాళ్లు ప్రజాకవి. జాతి, మత, విచక్షణ పాటించక సమస్త ప్రపంచాన్ని తన కుటుంబంగా భావించుకొనిన సుకుమార హృదయుడు. ఈయన షష్టిపూర్తి సందర్భములో మా యువభారతి ప్రకటించిన యీ కవితా సంహితకు నా హృదయ పూర్వకమైన సుస్వాగతము.

హైద్రాబాదు
9–9–1974

దేవులపల్లి రామానుజరావు

యువభారతీ!

తీరుబడి లేక రాబడి చాలక సతమతమౌతున్న యీ రోజుల్లో నా షష్టిపూర్తి. 'కరువుబొంటి' కాలంలో 'నా గొడవ' నీ ఆస్థాన ముఖంగా మళ్ళీ వినిపిస్తున్నావు. ఎంతటి ఉదారం నీది. తీవిగా, అందంగా, నీ దర్జాకు తగినరీతిగా అన్నీ సమకూర్చి నిన్ను కాపాడుతున్న సంచాలకుల దీక్ష అటువంటిది. నేనూ గౌరవ సభ్యుణ్ణే. దీక్షాబద్ధులైన నీ కార్యకర్తలకు యీ సందర్భంలో నా శుభాకాంక్షలు.

కాళన్న -

# నా గొడవ

## మాతృదేశము

మాతృదేశము మాట ముచ్చట
ముదము గూర్చదు మదికి నదియెటి
పరమ నీచుడు ధరణినంతట
గలయ వెదకిన గాననగునా?

నీరులేని ఎడారి యైనను
వాన వరదల వసతియైనను
అగ్గికొండల అవనియైనను
మాతృదేశము మాతృదేశమె.

దేశదేశము తిరిగిచూడుము
కొంత హాయియె కూర్చు మదికిని
నాల్గురోజులు నచ్చదేదియు
స్వర్గమే నపవర్గమేనియు.

తల్లి ఏడుపు తండ్రికోపము
భార్యబిడ్డల ప్రణయపాశము
ఇంచుకయు గణియింప నీయదు
మాతృదేశము మాతృదేశమె.

లాఠిదెబ్బల లక్ష్యమేమీ
కఠినశిక్షయె కాదుకాదు
చావుకైనను జంకనీయదు
మాతృదేశము మాతృదేశమె.

పొట్టకన్నము, కట్టబట్టయు,
లేవి బ్రతుకును లెక్కసేయక
యెచ్చటికి బోనిచ్చ గింపము
మాతృదేశము మాతృదేశమె.

స్వర్గమే అపవర్గమేయని
చాటిచెప్పెదు జన్మభూమియె
పరుల వశమున నరకకూపము
కన్న హేయము కఠిన తరము. (1941)

# వ్యత్యాసాలు

అన్నపురాసులు ఒకచోట
ఆకలిమంటలు ఒకచోట
హంసతూలిక లొకచోట
అలసిన దేహాలొకచోట.
సంపదలన్ని యొకచోట
గంపెడు బలగంబొకచోట
వాసననూనియ లొకచోట
మాసినతల లింకొకచోట
కమ్మని చకిలా లొకచోట
గట్టిదౌడ లింకొకచోట.
బాహ్యబంధనము లొకచోట
భావ బంధనము లొకచోట
కామిని వాంఛలు ఒకచోట
కౌగిలింత లింకొకచోట.
తనువులు ఉండే దొకచోట
తలపులు ఉండే దొకచోట
కావ్యగానము లొకచోట
కావ్యపిపాసువు లొకచోట.
కళాప్రదర్శన మొకచోట
కళారాధకులు ఒకచోట
సాహితీనిలయ మొకచోట
చదువులంతింకొకచోట.
పెత్తన మంతింకొకచోట
సత్తువ యంతింకొకచోట
అనుభవమంతా ఒకచోట
అధికారంబది యొకచోట (1942)

# ఆంధ్రుడా !

ఏభాషరా నీది యేమి వేషమురా ?
ఈభాష ఈవేష మెవరికోసమురా ?
ఆంగ్లమందున మాటలాడ గల్గగనే
ఇంతగా గుల్కెదవు ఎందుకోసమురా ?

సూటు బూటు హ్యాటు షోకుగా దొడుగ
ఘనతేమి వచ్చెరా గర్వమేటికిరా ?
ఏ భాషరా నీది యేమి వేషమురా ?
ఈభాష ఈవేష మెవరికోసమురా ?
ఉర్దు మాటలాడి యుబ్బుబ్బి పడుటకు
కారణంబేమిటో కాస్త చెప్పుముటా ?
లాగు షేర్వాణీలు బాగుండుననుచు
మురిసిపోయెదవంత మురిపమేమిటిరా ?
ఏ భాషరా నీది యేమి వేషమురా ?
ఈభాష ఈవేష మెవరికోసమురా ?
నీ వేషభాషలిల నిగ్గుదేలినవన్న
విషయంబు నీవేల విస్మరించెదురా ?
నీభాష దీనతకు నీవేష దుస్థితికి
కారకుడ నీవయని కాంచవెందుకురా ?
ఏ భాషరా నీది ఏమి వేషమురా ?
ఈభాష ఈవేష మెవరికోసమురా ?
నీవేష భాషలను నిర్లక్ష్యముగ జూచు
భావదాస్యంబెప్డు బాసిపోవునురా ?
నీభాషయందును నీవేష మందును
అభిమాన ముడిగిన అనదవీవేరా ?
ఏభాషరా నీది యేమి వేషమురా ?
ఈభాష ఈవేష మెవరికోసమురా ?
దేశభాషలయందు తెల్గులెస్స యటంచు
తెలుగుబిడ్డా ! యెప్డు తెలుసుకొందువురా !
తెలుగు బిడ్డవురోరి తెల్గు మాట్లాడుటకు
సంకోచ పడియెదు సంగతేమిటిరా ?
ఏ భాషరా నీది యేమి వేషమురా ?
ఈభాష ఈవేష మెవరికోసమురా ?
తెలుగు బిడ్డవయ్యు తెల్గురాదంచును
సిగ్గులేక ఇంక జెప్పుటెందుకురా ?
అన్యభాషలు నేర్చి ఆంధ్రంబు రాదంచు
సకిలించు ఆంధ్రుడా ! చావవెందుకురా ?
ఏభాషరా నీది యేమి వేషమురా ?
ఈభాష ఈవేష మెవరికోసమురా ?

# దీపావళి దీపాలు

అమవస చీకట్ల నాకాశమున కంపి
మిఱుమిట్లు గొల్పేటి మెఱుపుదీపాలు
మిద్దె మేడమీద మింటి చుక్కలదాక
వేయిరంగుల వెల్గు వింతదీపాలు

ఊరి వెలుపలనున్న పూరిగుడిసెల దూరి
లోని చీకటి బాపలేని దీపాలు
దోచిదాచినదెంతో దుర్భాగ్యులకు జూప
ధనపూజ చేయించు ధర్మదీపాలు

రక్కసుని చావుచే రంజిల్లె జగమంచు
కోటి వెల్గులుచాటె నాటిదీపాలు
రక్కసులు బాధింప రక్షయే లేదంచు
కోటిరీతుల చెప్పు నేటిదీపాలు. (1945)

# కర్షకా !

నర్తకుని నాట్యాలు గాయకుని గానాలు
వాదకుని వాద్యాలు శిల్పకుని శిల్పాలు
చిత్రకుని చిత్రాలు అంగనల అందాలు
కందర్పు కయ్యాలు కవిరాజు కావ్యాలు
కర్షకా ! నీ కన్ను కదలినన్నాళ్ళే.

దాంభికుని తత్వాలు మాంత్రికుని మంత్రాలు
తాంత్రికుని తంత్రాలు
గురువుల గోప్యాలు గుడుగుడుగుంచాలు
దేవుళ్ళ తిరునాళ్ళు దివ్యనది తీర్థాలు
కర్షకా ! నీ కన్ను కదలినన్నాళ్ళే.

ధార్మికుని దానాలు పండితుని భాష్యాలు
జ్యోతిష్కుని జోస్యాలు తార్కికుని తర్కాలు
వర్తకుని వాజ్యాలు పకీళ్ళ వాదాలు
సైనికుని శౌర్యాలు యాంత్రికుని [illegible]త్రాలు
యోధుల యుద్ధాలు రాజుల రాజ్యాలు
కర్షకా ! నీ కన్ను కదలినన్నాళ్ళే. (1945)

# ఇంకెన్నాళ్ళు ?

నవ యుగంబున నాజీవృత్తుల
నగ్ననృత్య మింకెన్నాళ్లు ?
పోలీసు అండను దౌర్జన్యాలు
పోషణంబొందే దెన్నాళ్లు ?
దమననీతితో దౌర్జన్యాలకు
దాగిలి మూతలు ఎన్నాళ్లు ?
కంచెయె చేనును మేయుచుండగా
కాంచకుండు టింకెన్నాళ్ళు ?
దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకొని
దొరలై వెలిగే దెన్నాళ్ళు ?
బాధలు పెట్టి పలుకనీయని
పాపులభయ మింకెన్నాళ్ళు ?
హింసపాపమని యెంచుదేశమున
హిట్లరత్వ మింకెన్నాళ్ళు ?
పగటి దోపిడుల నాపగలేని
ప్రభుత్వముండే దెన్నాళ్ళు ?
ప్రజాదరణ గోల్పోయి దేశమును
పాలనజేసే దెన్నాళ్ళు ?
పగటి వేసములు యెన్ని వేసినా
పాపముదాగే దెన్నాళ్ళు ?
పాపపు కుండ బ్రద్దలుకాక
భద్రంగుండే దెన్నాళ్ళు ?
ప్రజానాయకుల ప్రకటన తప్పను
ప్రభుత్వపత్రా లెన్నాళ్ళు ?
ప్రతిష్ఠపేరిట తప్పులుదాచే
పాడుపద్ధతింకెన్నాళ్ళు ?
శాంతి భద్రతలపేర దుష్టతను
సమర్థించు టింకెన్నాళ్ళు ?
తత్వభేదమని మనలో మనకీ
తన్నులాట లింకెన్నాళ్ళు ?
సంఘ సేవకులపై దౌర్జన్యము
సాగనిచ్చు టింకెన్నాళ్ళు ?

విప్లవ గాథలు వినుచు అందరు
వేచియుందు రింకెన్నాళ్ళు ?
అగ్గికొండలో నగ్నిజ్వాలలు
అణగియుండు నింకెన్నాళ్ళు ?
ఫలితములేక పాపులకొరకీ
పాడుకష్ట మింకెన్నాళ్ళు ?
ప్రజాశక్తికి పరీక్ష సమయము
ప్రతీక్ష మనకింకెన్నాళ్ళు ?
దౌర్జన్యము నెదిరించక మనకీ
దాసోహం ఇంకెన్నాళ్ళు ?
పురుషులపై కాపురుషులు
విజయము పొందుచుండు రింకెన్నాళ్ళు ?
సంక్రాంతి పురుషుడు దుష్టతపైన
స్వారిజేయడింకెన్నాళ్ళు ?
కలము పోటున కదపజాలని
కావ్యగాన మింకెన్నాళ్ళు ?
కాళోజీకవి కైతలు వినియు
కదలకుందు రింకెన్నాళ్ళు ? (1944)

## చాదస్తం

ప్రతి చాదస్తం దేవుడే
ఏదో ఒకరూపంలో గోకుడే.
పుట్టుకతోనే పుట్టు నీ పుండు
అగపడక అంతరంగాన నుండు.
భావానుగుణ్యం రూపం
శక్తినిబట్టి సాక్షాత్కారం.
సిగము పూనిస్తుంది వుపాసన
గిట్టదు గిట్టదు మరొక వాసన.
రామభక్తుడైన హనుమంతుడు
కృష్ణుని ఆనవాలు పట్టడు.
నస్యంజూస్తే యేవగింపు
జర్దారూపంలో గిట్టును కంపు.
నామరూపాలు అనంతం
ఎవనిదివానికే వసంతం.

అనుభూతి వర్ణనాతీతం
'సత్యం శివం సుందరం'
ప్రతి రంగాన దీనిదే చిక్కు
గాయానికి కట్టనీదు పక్కు
హాయి, గోకినాకొద్ది హాయి
మంటను లెక్కించని స్థాయి.
వ్యసనాలు, మహావ్రతాలు
వ్యక్తిగత చాదస్తాలు.
దరిదాపున చేరిన మౌఢ్యం
వ్యాపింపజేయు నీ జాడ్యం
ముఠాబంచీ సిద్ధాంతాలు
ఈ జాడ్యానివే వ్యాపక రూపాలు.
ఒక సిద్ధాంతము పూనినపుడు కసి
మరొకదానిని చేస్తుంది మసి.
ప్రబోధ నినాదాల పొరలు
గాలాలను దాచే ఎరలు.
'భ్రమర కీటక న్యాయం'
రంగు రుద్దుటకు సాయం.
ఊబిలోపడిన ప్రతివాడు
ఆనందాబ్ధిఅని అంటాడు.

## ద్వైత జగత్తు

కుటిల మతుల దేబెమొగాలు
జగతిలో రెండేరెండు రకాలు.
చతురవర్గ విలాసంకొరకు
దేబెల సర్వస్వం ముడిసరుకు.
లోకమెపుడు చతురునిదే సొత్తు
లే దమాయకున కందలపొత్తు.
శాస్త్రకార్లు శాసనకర్తలు
జనులకు తాళికట్టని భర్తలు.
చేయుటకై సామాన్యుల లూటీ
చాణక్యుల మధ్యన పోటీ।
దిక్కుమొగపు జనసముదాయం
టక్కరి బృందానికి తృణప్రాయం.

చతురులు చతురులు పోటీపడి
మూఢ సముదాయాలకు గూర్తురు రాపిడి.
చతురునిదే అన్నిట పైచేయి
అతడన్న పగలుకూడ రేయి.
దండెగొట్టు తెలివుండిన చాలు
జోకవచ్చు గింజలుగా తాలు.
మేధావుల కార్యాచరణము
సామాన్యులపాలిటి మరణము.
టక్కరిదే అన్నిట జోరు
నూరారు ఆరౌతవి నూరు.
పేర్లమార్పు కలిగించును మత్తు
తరచిచూడ సామాన్యుదె తొత్తు.
ప్రజాస్వామ్యం గణరాజ్యం
చతురనాయకమ్మన్యుల భోజ్యం
తోడేలు అండనున్న మేకలు
'బ్యా' అన్న ఊడిపోవు పీకలు.
తోడేలునుచంపి చిరుతపులి
మేకలమ్రింగి తీర్చుకొను నాకలి
పాలితులపై జరిగే శోషణ
పాలకవర్గంచేసే పోషణ.
జనులకు సహింపరాని అన్యాయం
శాంతి భద్రతల కాపాదే న్యాయం
మంచి తలపెట్టిన కొందరమాయకులు
త్రాగిరివిషం కొటించుకొనిరి మేకలు.
చెంపపై కొట్ట, జాచి రెండవ చెంప
కొట్టుమన్న క్రైస్తునెత్తిన కంప.
సత్యాహింసల యేబదేండ్లకృషి
క్షణంలో అయిపోయెను మసి.
బ్రతికినపుడులేదు తోడునీడ
చచ్చిన అనిపించెను పోయెపీడ.
కలిగిన సంతోషాన్ని కప్పిపుచ్చి
మొసళ్లు కన్నీళ్ళ వెళ్ళుబుచ్చి.
సానుభూతి సంతాపక సభల

శాంతింపజేస్తున్నా రమాయకుల
వహ్వారే కుట్ర చలాకీ
అందించిరి గోడ్సేకు తుపాకీ
అతడు అజాతశత్రువు యేకాకీ. (1949)

# ఏటేటా ఎందుకు నీపాట

ఏడుమారినా యీడు ముదిరినా
ఏమిమారినది యీ లోకంలో ?
రాయిరువ్వినా రాకెటు విసరినా
గిట్టనివానిని కొట్టుటకేకద !
కాలనడచినా కారుయెక్కినా
కోరినచోటికి చేరుటకే కద !
పోయిచెప్పినా ఫోనుచేసినా
తలచినదేదో తెలుపుటకే కద !
గేగుకొరికినా కేకునమలినా
ఆకలిమంటను ఆర్పుటకే కద !
కేకపెట్టినా కేబులిచ్చినా
ఆపదాపదని అరచుటకే కద !
కన్నుగీటినా కమ్మవ్రాసినా
కాముకవృత్తిని కదపుటకేకద !
ఆకుకట్టినా కోకచుట్టినా
తోచినకాడికి దాచుటకేకద !
హారతిచ్చినా అడ్రెసిచ్చినా
పొగడి మన్ననల పొందుటకేకద ! (1950)

# నా ఇజం

నాది నిత్యనూత్న వికసిత జ్ఞానం
మీది "బుద్ధిజాడ్య జనితోన్మాదం"
నా కందినది నాది — నా కందనిది మనది
నేనున్నదే నిలువదగినచోటు — అటువిటు పోయివచ్చో లోటు

నసుదాటిన భ్రష్టాచారం - వెనుకపడిన చాదస్తం.
నాకోపం స్వభావసిద్ధం - మీకై నను ఓర్పుండొద్దా ?
నాకున్నవి అన్నియు హాబీలు - మీకున్నవి వ్యసనాలవి తగవు.
నాదంతయు Up-to-date Culture
Thus far and no further
యిదిగిదిగో చెలియలికట్ట - కాదన్నవాని కన్నులులొట్ట
నానా 'యిజాల' కడుగునచూడ
'నాయిజం'దే అగుపడును జాడ.

## లేకుంటేమి

కనులు గుసగుస కనులు వినగల్గినాక
పలుకుల తేనియలు జిలకకుంటేమి ?
మనసు మనసూకలిసి మనగల్గినాక
దేహాల దాహాలు తీరకుంటేమి ?
ఆత్మసౌందర్యాల నరయగలిగాక
కన్నులూ అందాల కాంచకుంటేమి ?
వావివరసలులేక వర్తించినాక
"సప్తపది" ఘనతలన్ చాటకుంటేమి ?
పడునవెల్ల వ్యర్థపాటులయ్యాక
తారుణ్యకాండను దాచకుంటేమి ?
పండించుప్రాణాలు పస్తుపడ్డాక
పాడురాజ్యాన్ని కాపాడకుంటేమి ?
కనులుమూసియె యంత కాంచగలిగాక
వెలుగుకోరుచువాని విప్పకుంటేమి ?
రక్షించువారలే భక్షించినాక
విష్ణువనిరేని సేవింపకుంటేమి ? (1942)

## చాలింక

బాధ్యతలేని ప్రభుత్వభటులు - పెట్టేబాధలు చాలింక
బాధ్యతగల పరిపాలనలేక - బ్రతికిన బ్రతుకులు చాలింక
హద్దుమీరి అధికారవర్గము - ఆడినఆటలు చాలింక
రాజుపేరట అరాజకమునకు - జరిగిన పూజలు చాలింక

రక్కసితనముకు పిశాచవృత్తికి - దొరికిన రక్షణ చాలింక
పాలనపేరట పల్లెపల్లెలో - జరిగేపాపము చాలింక
రక్షణకై ఏర్పడ్డబలగమే - చేసే భక్షణ చాలింక
బీదలసర్వస్వముతో ధనికులు - చేసేబేరము చాలింక
విచ్చలవిడిగా ప్రాణమానముల - పాడినవేలము చాలింక
దొంగలంత దొరతనముపేరట - చేసినదోపిడి చాలింక
పగటివేషములు వేసి భిన్నముగ - దాచినపాపము చాలింక
వాస్తవంబును దాచిపెట్టెడు - తప్పుడువ్రాతలు చాలింక
లంచముదొరికిన యంతనె న్యాయము - తలనువంచడము చాలింక
'మూతులునాకుచు' ఆత్మవంచనతో - కట్టినమూటలు చాలింక
కాలము వ్యర్థముజేయగ కళయని - వ్రాసేకైతలు చాలింక
కైతచేత మేల్కొల్పుకున్న - కాళోజి కాయము చాలింక. (1945)

## తీర్పు

ప్రజాసంస్థపై పగసాధించిన — ఫలితముతప్పక బయటపడున్.
నిక్కుచునీల్గే నిరంకుశత్వము — నిల్వలేక నేలనుగూలున్.
చిలిపిచేష్టకై చిల్లిపొడిచినను — స్థిరమగుకట్టయు శిథిలమగున్
ఎట్టకేలకు గట్టిగోడలును — తట్టుకొనక భూమట్టమగున్
కూర్చొనియున్న కొమ్మను నరికిన — కూలదెట్లు కొమ్మయుతానున్
తా నితరులకై తవ్వినగోతిలో — తనకేతెలియక దబ్బునకూలున్.
ప్రజాశక్తిపై పందెమువేసిన — ప్రభుత్వమేపాటిగ నిల్చున్.
నివురుగప్పిన నిప్పును వూదిన
నిండవెలిగి నింగిని ముట్టున్.
బేజారైన బీదల వోపిక — పెద్దలపై పిడుగైరాలును.
'అయ్యబానిస'ను అనినపౌరుడే
అయ్యగొంతుకనట్టే అదుమున్.
భస్మమొనర్చే వరములబొందిన — భస్మాసురుడే భస్మంబాయెన్
కానున్నదికని కాళోజీకవి
కైతలోపల ఘాటుకచెప్పున్. (1946)

## జంట సింగిణీలు

దానిమ్మగింజలో దాగిన యెరుపు
లేత అరిటాకు పైపూతల నునుపు.
క్రొత్త సుఖములలోని మెత్తందనాలు
చిన్నతల్లీపాల కమ్మందనాలు.
గోదుగ్ధధారల గోర్వెచ్చదనము
ద్రాక్షఫలములలోన ద్రవియించుతీపి.
పువ్వు పొదుగుల్లోన పొంగేటితేనె
మునిమునినవ్వుల కుసుమముల సొంపు.
అందచందాలొక్క ఆనందఝరులు
చంటిపాపని పెదవి జంటసింగిణులలో
అన్నిచేరి ఆటలాడుతున్నాయి.

## దేవతలెరుగని దివ్యానుభవము

చెలిమియే కలిమిగా గలిగియుండుటను
చెలిమి మహిమను కొంత చెప్పెదను వినుము
అక్కరలు దీర్చుమని అడుగ నక్కరలేదు.
అడిగినను అయ్యది యాచనసలేగాదు
అడుగకయె పొందినను అపచారమునుగాదు
చేయిక్రిందాయెనని చింతింప పనిలేదు
చేయిమీదాయెనని చెప్పి యుబ్బుటలేదు
పిలువకయె పోయినను తలవంచ పనిలేదు
పిలుపురాదాయెనని అలుకబూనుటలేదు
కులముతో పనిలేదు గుణముతోడనులేదు
అందచందాలతో నావశ్యకములేదు
వయసుతో పనిలేదు వరుసతోడనులేదు
కలిమిలేములురెండు కలిసిసయ్యాటాడు
పండితుడు పామరుని పల్కించి మాటాడు
వ్రతము వ్యసనముకలిసి వల్లించు పాఠాలు
ఎట్టి వ్యత్యాసమ్మొకించు కడ్డమురాదు
వంచింపపనిబూని పొంచియుండుటలేదు

తీయతీయగ బల్కి మాయజేయుటలేదు
తడిగుడ్డ పదనుతో మెడలుగోయుటలేదు
మొసలికన్నులనీటి మోసమించుకలేదు
నాటకపు వేషాల బూటకంబునులేదు
నచ్చజెప్పుచెకాని రచ్చకీడ్చుటలేదు
నీదినాదను భేదవాదమేలేదు
సంపూర్ణ సహకార సంఘంబుమైత్రి
స్వార్థ రహితంబైన చరితంబు మైత్రి
పూర్వజన్మము సేత పుణ్యములపంట
నేటి జన్మములోన నెచ్చెలుల జంట
మిట్టమధ్యాహ్నమున దట్టమగునీడ
మండు వేసవిలోన మలయమారుతము
త్రుంగు యెదలకుశాంతి గ్రుడ్డిబ్రతుకుకు కాంతి
మానవత్వము మెఱుగు మర్త్యలోకపు వెలుగు
దేవతలె యెరుగని దివ్యానుభవము.

# నగ్నసత్యాలు

ఉత్త మాటలు కట్టిపెట్టి — పెత్తనాలకు దేవులాడక
చిత్తశుద్ధిగ చేయబూనిన — చేతలెల్ల ఘటించినట్లే.
న్యాయమును పాటింపనొల్లని — అధిపత్యము అందయుండిన
హత్య, దోపిడి, మానభంగాల్ — నిత్యకర్మల చేరినట్లే.
రక్షణకు ఏర్పడ్డ బలగము — రక్కసుల పక్షంబుచేరిన
రాక్షసుల యిష్టానుసారం — రాజ్యమును నడిపించినట్లే.
పట్టపగలే పట్టణంలో పట్టి — పౌరుల కొట్టిచంపిన
దుష్టకూటముతో ప్రభుత్వం — దొంగబేరము చేసినట్లే.
దుష్టులకు తావిచ్చితోడై — శిష్టులను హింసించు తులువల
అధిపత్యములోన కులజులు — అనదలై జీవించినట్లే.
కడుపునిండని కాపుకొడవలి — కాసుదొరకని కూలిసుత్తి
కలిసియెత్తిన దొంగదొరలూ — కంపమెత్తి చచ్చినట్లే.
బూజుపట్టిన రాజ్యభారం — మోయజాలక జానపదులు

రోజుచుండే దేశ మేలెడు — రాజారోజులు వింటినట్లే.
తల్లగాదిది, కైతగాదిది — కాలదేవత గర్భవేదన
అరసి; కాళోజి వచించుట
అనుభవమునకు వచ్చినట్లే.

## వయసు

ఉన్న వంకలదిద్ది పోయేటి మిషతో
లేనివంకల తెచ్చిపెట్టే వయసు.
కండ్లగంతలతోడ గంతులిడుకుంటూ
కాంచేటికండ్లతో కదలేటి వయసు.
ఆకాశ హర్మ్యాల అందునాళలతో
అవనిపై కాల్మోపలేవట్టి వయసు.
గడియలో లోకాల కరగించు గర్వాన
కనురెప్పపాటులో కరగేటి వయసు.
జంకినట్లె జంకి బెదరినట్లె బెదరి
జంకు బిడియములేక జంగలిడు వయసు.
గడుసు గుండెల్లో గగుర్పాటు జనియింప
గజగామినుల గంతులేయించు వయసు.
కంటిచూపులవాడి కవ్వాల నాడించి
గడుసు గుండెలలోతు కన్పెట్టు వయసు.
'మాటమంతీ' లేక మంత్రాలు లేక
మానసాంబుధులనే మధియించు వయసు.

## నేను

నీవున్నచోట విజ్ఞపీగుచు అపర
హిట్లరౌతాను నే హిట్లరౌతాను
తల్లదన్నుహానికర తలవంచి దయ [illegible]
గాంధినౌతాను నే గాంధినౌతాను.

మందితప్పుల ఏరిమనసు ఖాతానింపి
వడ్డీ వడ్డీకట్టి వల్లించుతాను
నా తప్పులనుదాచ నానారకాలైన
ధర్మసూత్రాలతో దడికట్టుతాను.

# చెలిమి

ఆత్మీయ వియోగబాధ
అణువుచిట్లి పలుకుగాథ
ఏ స్నేహమున మనలి ఇంత వెలిగితిమో
ఆ స్నేహమును బాసి ఆరిపోదామా ?
కంటకాలకు బెదరి జంటవిడిచి మనము
పూలహాయినిగూడ కోలుపోదామా ?

ఆత్మీయతను వలచి అన్ని ఓర్చిన మనము
అంటువ్యాధిగ తలచి అంటబెదరుట వింత
క్షీరాన్నముగయెంచి కోరికోరీ కుడిచి
చేదుమ్రింగిన పగిది ఖేదమొందుట వింత
నేటి కలతలనోటి కోటికోరలు నాటి
మేటి మమతలతాకి కేచేయుటయు వింత.

ఏనాడో ఏనాడు ఈనాటి చీకట్లు
వెలుగుసోకగ తిరిగి తొలగిపోవును మనల
ఆనాటి వెలుగులో ఈనాటి భ్రమలన్ని
విడిపోయి మనమగుచు కడజేరి మనగలము
ఏడుఅడుగులనేల కూడి నడిచినయంత
కలకాలముండేటి చెలిమి చేకూరునట.
నడమంతరపు చిలిపి గడబిడలు ఎగబాట్లు
అలుకలు - అగచాట్లు చెలిమిలో సహజమట
ఏ త్రోవ నడచినను ఏ మ్రోల నిలిచినను
అడుగులేసిననాటి ముడి మనల వీడదట
ఈనాటి మననడత పేనుచున్నది కలత
బిడియమేసిన గడియ ఎడమొగము పెడమొగము
గడియకాలపు నగము పడినవ్వటకు జగము
కడజేరగాలేక మిడుకులాడెడి మనము

నా ఎడద నిలిచిన నీ యెడద గురుతు
ఆనాటి ఆగురుతు నేనెటులు మరుతు ?
మాయ మమతల గురుతు మాయజాలని గురుతు
నాణ్యమై నా స్మృతుల నాట్యమాడే గురుతు
చీకగా యెదజేరి మోక్షమైన గురుతు
లోకమును మరపించి నాకమైన గురుతు
ఎదిగి యెదిగీ ఒరిగె ఎదనిండ నీ గురుతు.

చెలిమితో గడిపినది కలదుకాలము కొంత
'మన' మనుచు మెలగినది 'మునుపు' వున్నది కొంత
కలయికను ఎరిగిన బలగమున్నది కొంత
సామరస్యము కనిన సాక్ష్యమున్నది కొంత
పాదుకొని ఆదుకొను 'యాది' వున్నది కొంత
ఆత్మీయతను చాటు ఆస్తి ఉన్నది కొంత
తోడునీడై పడిన జాడవున్నది కొంత
కూడికూర్చినయట్టి గోడుఉన్నది కొంత
ఏకమై పాడినది శోకమున్నది కొంత
ఏకమై చూచినది నాకమున్నది కొంత
చెరిపినను చెదరని సరుకు ఉన్నది కొంత
మరపు మింగగలేని కరకు ఉన్నది కొంత
ఇరువురము మోసినది బరువు వున్నది కొంత
బ్రతుకు బరువుల బాపు క్రతువు వున్నది కొంత
కలసిపేర్చిన చరిత నిలిచి ఉన్నది కొంత
'మునుపు' నిప్పుడు కేయు దినుసు వున్నది కొంత
ఆ కొంత ఆ వింత అమృతంపు పుంత
మరచిపోవుటయెట్లు మరచి బ్రతుకుట యెట్లు
'మునుపు' మాపి మారు మనువు పోదామా ?
మనువు మారుటకేగాని మనకుతరమౌనా ?

ఆనాడు సర్వస్వమైనట్టి నేను — ఈనాడు ఏమియును ఎందులకు కాను ?
ఆనాడు స్నేహాల నింపినది నీవే — ఈనాడు స్నేహాల త్రెంపినది నీవే
ఆనాడు నాముండ్లు మొనలరగలేదు — ఈనాడు నాపూలు ముకుళించలేదు
ఏమి తరిగినదంచు ఈ తారుమారు ?

ఏమి పెరిగినదంచు ఈ బొరు సౌరు?
ఆనాటి 'నాతనము' నాలోన లేదా?
ఆనాటి 'నీతనము' నీలోన లేదా?
తరుగు పెరుగుల మాట ఎరుగునా స్నేహంబు
స్నిగ్ధతను వీడునా స్నేహమెపుడైన?
చెలిమి – లేముల చేదు చిలుక బ్రతుకుట యెట్లు?
చెలిమి కలుములు మ్రింగి బలిమిగ్రక్కుట యెట్లు?
మన మనసులో మమత మసలెనెప్పుడు తొలుత
నీకుమాత్రము యెరుక నాకుమాత్రము యెరుక
చదలవాడలో చుక్క మొదట మొలచిన దెపుడొ
చదలవాడలో చుక్క మొదట పొడిచిన దెపుడొ
అందాల చూపులను విందారగించుమని
వెలుగు విస్తరిజేరి పిలచినది యెపుడొ?
నీకు మాత్రము యెరుక నాకుమాత్రము యెరుక
పూలవాసనతీపి గాలి మోసినదెపుడొ
వాసనల నాసికలు శ్వాస జేసిన దెపుడొ
నీకుమాత్రము యెరుక నాకుమాత్రము యెరుక
ఆత్మీయతనుపొంద ఆత్మ తహ తహ యేల?
అన్యత్వమున ఆత్మహననమొందుట యేల?
నన్ను నీవీనాడు ఎన్ని అన్నను అప్పు
డన్న మాటకె యెపుడు చిన్నెమై వుంటాను.

# పుకార్లు

పుకార్లు కూడా అపౌరుషేయాలు
పేడి మూతుల అయాచిత సందేశాలు
అమాయకుల కర్ణగర్భితాలు
అయోమయం జిహ్వాచాపల్యాలు
కాకమ్మ వార్తా వాహినులు
ఎందివరుగైన సామాన్యుని ద్వేషానికి
అగ్గిపెట్టించే రాపిళ్ళు.

# ఆస్తికుడా !

'సోహం' అని జపియిస్తూ
క్షుద్రునివలె జీవిస్తావెందుకు ?
ఆత్మ అమరత్వాన్ని ఏకరువుపెడుతూ
ఐహికాలకై తోకాడిస్తావెందుకు ?
'సత్యమేవ జయతి' అంటూ
అసత్యాలతో రాజీపడతావెందుకు ?
మృత్యుంజయు నారాధిస్తూ చావంటే బెదిరి చస్తావెందుకు !
శివభక్తుల ముస్తాబుతో శవారాధన చేస్తావెందుకు ?

# ఏదైననేమి ?

విలపింపగావేద నేదైననేమి ?
చితిని చేర్పగ చింత ఏదైననేమి ?
కొల్లగొట్టగ కొంప ఏదైననేమి ?
కోయదలచిన గొంతు ఏదైననేమి ?
బాకు దూయగ సాకు ఏదైననేమి ?
కడుపుమంటకు కబళ మేదైన నేమి ?
తిట్టదలచిన దివస మేదైననేమి ?
చంపబూనిన సమయ మేదైననేమి ?
వ్యభిచరింపగ వరుస ఏదైననేమి ?

# కోకిలా !

లేమావి చివురులను లెస్సగా మేసేవు
ఋతురాజు వచ్చెనని అతిసంభ్రమముతోడ
మావి కొమ్మలమీద మైమరచి పాడేవు
తిన్నతిండెవ్వారిదే కోకిలా ! పాడు పాటెవ్వారిదే కోకిలా !
పేరు ఊరూలేని పిచ్చుకవు; దయతలచి
చేరదీసి నిన్ను గారవము చేసినా
మావిగున్నలమాట మాటవరుసకునైన
ఎన్నడైనను తలచితే కోకిలా ! ఎప్పుడైనను పాడితే కోకిలా !

ఇంపైన 'కూకూ'ల సొంపైన రాగాల, విందుగా నీగొంతు నింపినమామిళ్ళ
మాటయే మరచి; మాలోని కొందరు చేరి
ప్రేమపేరిట కాదచే కోకిలా! పెత్తనము నిచ్చారహో కోకిలా!
ఆమె నాదరియుండ హాయి చేకూర్చెదవు
విడిపోయి మేమెద్వ విరహాగ్ని పెంచెదవు
ఆమె నాదరియుండ హాయి చేకూర్చుటకు
అన్యసాధనలేటికే కోకిలా
విడిపోయి మేమేద్వ విరహాగ్ని పెంచుటకు
అల్పబాధల వేటికే కోకిలా!
ఏనాటి సుకృతమొ? ఏ విశ్వకవి చలువొ?
ఈనాడు నిన్నింత దానిగా చేసినది - అంతకే నీవేద ఆగలేకున్నావు?
లేకున్న నీలెక్క యెందులో కోకిలా
లేకున్న నీవేద నుందువో కోకిలా? (1945)

# సరస్వతీ భక్తుల్లారా!

కైతకు లక్షణాలున్నాయి కోటొక్కటి,
వానిలో వ్యాకరణంకూడా ఒక్కటి.
మీకు దాని సూత్రాలే సర్వస్వం.
గొంతుకు పోసుకొని ప్రేలాడ సతతం,
చేస్తారు ఆక్రందన; అంటారు కవిత్వం.
"కైతకు వ్యాకరణమే పరమావధి
కాదు అసలేకాదు" అన్నాడు దాశరథి;
మా రచనలో వ్యాకరణం మాత్రమే లేదు,
మీ రచనంతా వ్యాకరణం; మరేమీకాదు.
వ్యాకరణ సూత్రాలు పెట్టేటిభట్టి,
కాదెప్పుడు కైతపాకం గట్టి.
పాతబాటల బట్టియే నడువగలరు మీరు.
మా నడకలో పడుతుంది క్రొత్తత్రోవలకు తీరు.
శతాబ్దాల తరబడి ప్రవాహంలోపడి
రాపిడిపుణ్యాన రూపురేఖలు దిద్దుకొన్న
ముద్దువచ్చే రాళ్ళను శివలింగాలని

కన్నుల కద్దుకొని భక్తులు పూజకై దాచుకొన్నట్లు
మా నోట రాలినమాట ఆనోటా ఆనోటా
వినవిందై, మనసు పసందై — జపించి, జపించి
సూత్రాలలో బిగించి, సారస్వత పూజాద్రవ్యంగా
భద్రపరచుకున్నారు మీ వైయాకరణులు
అప్పుడప్పుడు మేమన్నదే అయినది
మీ అప్పకవీయం, కౌముది
సరస్వతీ భక్తుల్లారా ! బ్రహ్మనే వెక్కిరిస్తారా !
మెరుపువలె పరుగిడు మా ఊహాతరంగాలకు
బక్కెద్దులనాపే పగ్గాలు పనికొస్తాయా ?
హైడ్రాలిక్ బ్రేక్సుకూడా ఫేలవుతున్నప్పుడు
ప్రళయజలధిని నింపదలచిన ప్రవాహాన్ని
ఆపడానికీ మీ ఆనకట్టలు పనికొస్తాయా
హిమాలయపర్వతపంక్తులే తలలువంచుకుంటున్నప్పుడు
ఎన్నెన్ని జన్మలెత్తి ఎంత సొంకంగా రాసినా
లేఖకుడు మహారచయిత అనబడడు
వలయాలూ, చతుర్భుజాలూ – వివిధకోణాకారాలు
నీటుగావేసే రేఖాగణితజ్ఞుడు
మహాచిత్రకారు డనబడడు.
చిత్రకారుడు గీసిన – జీవితముట్టిపడే చిత్తరువులో
అవయవాల సొంపును జూపే
ఎత్తువంపులు కాధారమైన గీతలు
వంకరటింకరగా ఉన్నాయన్న రేఖకుడు
మా రచనల్లో తప్పులున్నాయనే వైయాకరణి. (1952)

# కన్నీటిలో ఎన్నెన్నో కలవు

కన్నీటిలో ఎన్నెన్నో కలవు – కన్నీటినిగన కన్నులు కలవు.
మసిబారిన ఎడదల రుసరుసలు – కసితీరని పడగల బుసబుసలు
విసుగెత్తిన జీవుల విసవిసలు – పసిగొంతులు నలిగిన పిసపిసలు
రసమూరెడి చూపుల గుసగుసలు
కన్నీటిలో ఎన్నెన్నో కలవు–కన్నీటినికన కన్నులు కలవు.
పెలవేసిన పీడల ములములలు – మొలవదలిన వలువల విలవిలలు

తలసూపెడి పదనుల జలజలలు
అలకెత్తిన నవ్వుల కిలకిలలు
వలచిక్కిన చేపల తళతళలు
కన్నీటిలో ఎన్నెన్నో కలవు - కన్నీటిని గన కన్నులు కలవు.
మతిచెరిపెడి పూర్వపు స్మృతిగతులు
వెతచెప్పక చెప్పెడు చతురతలు
దయకోరెడి గుండెల కుయకుయలు
నయమనుకొన కలిగెడు లయలయలు
కన్నీటిలో ఎన్నెన్నో కలవు - కన్నీటిని గన కన్నులు కలవు.
మటుమాయము జేసెడు మిటమిటలు
ఎటుతోచక కలిగెడు కటకటలు
కిటుకెరుగని కోపపు చిటపటలు
ఆట మటపడి దాచిన గుటగుటలు
కన్నీటిలో ఎన్నెన్నో కలవు – కన్నీటిని గన కన్నులు కలవు.
హడలెత్తిన ఎదదల గడగడలు
తడబాటులో దాగని దడదడలు
ఎడబాటులో కలిగిన గడబిడలు
మిడిమేలపు వంతల నడవడులు
కన్నీటిలో ఎన్నెన్నో కలవు - కన్నీటిని గన కన్నులు కలవు.

## చెమ్మగిలిన కన్నులలో

చెమ్మగిలిన కన్నులలో – కమ్మలెన్నొ చదివినాను
ఒలికి పారలేని బాధ – పలుకు జారనీని గాధ.
చిలికి బయటపడెడి గుట్టు - బలిమినెటులో దాచినట్టు
చెమ్మగిలిన కన్నులలో – కమ్మలెన్నొ చదివినాను.
మనసుమాట మారలేదు – ఉనికి తప్పి జారిపోదు
తనువు యిపుడు నీదికాదు – 'మునుపు' తిరిగిరాదు రాదు
చెమ్మగిలిన కన్నులలో - కమ్మలెన్నొ చదివినాను.
నలుగురివలె మనముకూడ - వెలతి పడుట తగదు తగదు
కలితిలేని ప్రేమ మనది – కలకాలం మనగలదు
చెమ్మగిలిన కన్నులలో – కమ్మలెన్నొ చదివినాను.
చిత్తమెపుడు నీదెసొత్తు - చెత్త ఇపుడు పరునితొత్తు

పల్లేరులు మదిని కెలక – మల్లెపూలమీది పడక
చెమ్మగిలిన కన్నులలో – కమ్మలెన్నొ చదివినాను.
చేరుకొంటి పరుని పంచ – కోరిగాదు పడకు కించ
'తాళి' పేర తలుగు పడగ – 'కేళి' పేర గేలి జరిగె
చెమ్మగిలిన కన్నులలో – కమ్మలెన్నొ చదివినాను.
చెదరలేదు ప్రేమపటము – ప్రిదులలేదు ప్రీతిఘటము
ఎదుట ఉంతు ఎడదపలక – చదువుకొనుము చెలిమివాలక
చెమ్మగిలిన కన్నులలో – కమ్మలెన్నొ చదివినాను.

## పోటీపడి కాటులాడ...

చాపచింపు – సామ్రాజ్యం
కోడిగుడ్డు – కోహినూరు
పాటిమన్ను – ప్లాటినం
బస్సుసీటు – బ్రహ్మరథం
ఏదైతేం ? ఏదైతేం ?
అడవిమనిషి – ఆచార్యుడు
పసిబాలుడు – పండుముసలి
బిచ్చగాడు – లచ్చిమగడు
తొత్తుకొడుకు – పెత్తనదార్
ఎవడైతేం ? ఎవడైతేం ?
పోటీపడి కాటులాడ ఎవడైతేం ?
తండ్రి–కొడుకు, తల్లిబిడ్డ
అన్నదమ్ము–దక్క–చెల్లె
బావమరిది భార్యభర్త – ఇరుగుపొరుగు ఎరుగనోరు
ఎవరైతేం ? ఎవరైతేం ?
పోటీపడి కాటులాడ ఎవరైతేం ?
విపణివీధి – తపోవనం
చాకిరేవు – శాసనసభ
సానికొంప – సాధుమఠం
మూత్రశాల – యాత్రాస్థలి
ఎచటైతేం ? ఎచటైతేం ?
పోటీపడి కాటులాడ
ఎచటైతేం ?

# దేవుడు

దేవుడు దేవుడు దేవుడు
దేవుడులేం దెవరికి ?
మనిషి మనిషి కొక్కొక్క మనసు
మనసు మనసు కొక్కొక్క దేవుడు
ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క దేవుడు.
ఎప్పుడూ ఏదో ఒక దేవుడు
పిపీలికంనుండి బ్రహ్మ పర్యంతం దేవుడు
అన్ని సుఖాలకూ మూలభూతం దేవుడు
అన్ని దుఃఖాలకూ మూలబీజం దేవుడు
బ్రతుకంతా దేవుళ్ళ సంఘర్షణ
మనం జేస్తున్నది దేవుళ్ళకు ఆత్మార్పణ
దేవుడు లేకుంటే ఏచిక్కూ లేదు
దేవుడులేకుంటే బ్రతుకే లేదు
ఒకరిదేవుడు మరొకరిదేవుడు తీరిస్తే
ఒకరిదేవుడు తీరడంలో మరొకరిదేవుడు తీరుతే
రక్తి - ముక్తి.

# ఆల్బర్ట్ ష్వైట్జర్

ఆధునిక ఆర్భాటాలకు దూరంగా
పట్టణవాసాల వాసనైనా సోకనిచోట
నాగరికతా సాగరాల చెలియలికట్టకు దూరంగా
ప్రకృతి కన్నెరికము పోగొట్టుకొనని చోట
వికృతిదుర్వాసుల మంత్రోపదేశాలు పారనిచోట
ఈనాటికీ స్త్రీలు పురుషులు — నిన్నంటే నిన్న నందనవనం నుండి
తరుమబడ్డ ఆదిమ దంపతులవలె మెలగుచోట
వ్యక్తిత్వం తొణికిసలాడేచోట
ఈషణత్రయం కాలూననిచోట — షడ్వర్గాలు పగబూననిచోట
కదిలే కుటుంబాలు పల్లెకైనా పట్టుబడనిచోట
బ్రతుకే భగవంతుడైనచోట
ఇచ్ఛయె ఈశ్వరుడను ఇంగితమున్నచోట
చావుకు జడియనిచోట

చంపుటకు వెనుదీయనిచోట — స్మృతిభూతము లేనిచోట
భావిభీతి రానిచోట — వర్తమానమే కాలమైనచోట
ప్రవర్తన వర్తమానాధీనమైన చోట
బతికున్నచోట బ్రతుకున్నచోట
బ్రతుకుపాఠాలు వల్లింప
నాగరికత పాపాలకు ప్రాయశ్చిత్తం చేసికొన
ఆదిమానవులలో ఒకడై బ్రతుకును పూజిస్తూ బ్రతికి
మానవసేవయే మాధవసేవగా యెంచి
ప్రపంచానికి బ్రతుకుబాట చూపిస్తూ
అమరత్వం సాధించిన మానవుడు — అల్బర్ట్ ష్విట్జర్.

# ఓ గాంధి!

ఇంకేమి కావాలె ?
ఇంకేమి కావాలె ?
బ్రతికినన్నాళ్ళు నిను - బాపుఅని పిలిచితిమి
చచ్చిపోయిన నిన్ను - జాతిపిత జేసితిమి
పెక్కు భంగుల నిన్ను - చెక్కి నిలవేసితిమి
వేడ్కతో ఇంటింట - వ్రేలాడ దీసితిమి
నీ పేరుతో టోపి - నిత్యమై పోయినది
నీ సూత్ర భాష్యమే - నిలువెల్ల దాచినది
నీ మాట మాటుననె - మామాట పలికితిమి
నీ అడుగులను జూసి - మా అడుగు వేసితిమి
నీచేతి సూత్రాలు - మాచేతి మగ్గాలు
కాలానుగుణ్యాదు - కూలముల ధరలెరిగి
అనుకూలమగు నేత - లనుసేసి వెలసినవి
ఏనాడొ నిను మేము - 'ఏసు'గా జేసితిమి
ఎవనిచేతనొ నీవు - ఏసగుట జూచితిమి
నీ నీడగామెలిగి - నిండార వెలిగితిమి
కాశోజి మాటలకు - కడుపుబ్బ నవ్వితిమి
ఇంకేమి కావాలె
ఇంకేమి కావాలె.

# మనిషిలోని కుళ్ళు మారురూపాలు

చెప్పులోని తుక్కు గుడ్డలోని పక్కు
వ్రాతలోని చిక్కు కట్టులోని ముక్కు
పరువుదప్పిన చెక్కు
మనిషిలోని కుళ్ళు మారురూపాలు.
మూనెలోని మడ్డి కూరలోని గడ్డి
గోడలోని నడ్డి అసలువెంబడి వడ్డి
మనిషిలోని కుళ్ళు మారురూపాలు.
పాలలోని జలము దారిలోని మలము
అలుకలోని బలము వచ్చిపోయే కులము
మనిషిలోని కుళ్ళు మారురూపాలు.
కోడితలపై విగ్గు జోకులోని మొగ్గు
పైటజారుడు సిగ్గు ప్యాంటుసర్దుడుదగ్గు
మనిషిలోనికుళ్లు మారురూపాలు.

# నేను బ్రతికేవుంటాను

నేను బ్రతికే వుంటాను
నా పరాయితనం పోగొట్టే ఆర్ద్రిత
చెలిమి చెలిమెలో చిందునన్నాళ్లు
నేను బ్రతికే వుంటాను.
నా ఇరుకుల చేరిదూరి
అడ్డమైన మురికినంతా తన్నేసే జీవననది
జీవనదిగా ప్రవహించుచున్నన్నాళ్లు
నేను బ్రతికే వుంటాను.
ఆతతాయి వాతావరణంలో కూడా
నా షడ్వర్గం తనశీలాన్ని కాపాడుకున్నన్నాళ్లు,
తోడు వాద్యాల తప్పుడు చప్పుళ్ళకు
సమశ్రుతిగా నా గాత్రం పెకలనన్నాళ్లు,
నేను బ్రతికే వుంటాను.
కంచం మంచం రెండే సర్వమ్మను వాదానికి
నా తెలివితేటలు తలవొగ్గ నిరాకరించినన్నాళ్లు,

నా జీవనానికి పాతాళం అడుగంట దిగజారే
చొరవ, సత్తువ, ధైర్యం ఉవ్వెత్తున లేచి
ఆకాశావకాశాలను వ్యాపింప
ఆవిరియై పొయ్యేటంతటి
తపన, తహతహ, సంసిద్ధత
సాహసం ఉన్నన్నాళ్లు
నేను బ్రతికే వుంటాను.

# దేబెల దౌర్భాగ్యం

కుటిలమతుల ధిక్కరించు - పటుత్వంబులేని టీన
దేశీయుల అగచాట్లను - దేబెల దౌర్భాగ్యంబును
సూటిగవచ్చిన మాటల - చాటిచెప్పుచుంటి నేను.
వ్యక్తిత్వము చచ్చిమనిషి - శక్తినంత కోలుపోయి
కీటుకెరిగిన వానిచేతి - కీలుబొమ్మఅయి ఆడును.
జానెడు పొట్టకు కరువని - బానెడు సమకూర్చుకొనగ
దౌర్జన్యముచేయు దొరకు దాసులు దేబెలు టీనులు.
భీముడు లేనట్టిచోట - బేరమాడి రాతమునకు
బకాసురుని మెప్పించుక - బ్రతుకుట తప్పవిసరియగు.
కోటివిద్యలైన తుదకు - కూటికొరకె అని అనుకొను
చిత్తవృత్తి యేర్పడి ప్రజ - చీడపురుగువలె బ్రతుకును.
వంచనజేసెడి వారికి - మంచము వాల్చుచు చేతులు
జోడించుచు అక్షరాల - పేడులొచు బ్రతుకు జనము.
నేటి శాసనాలు రాతి - నాటి శాసనాల వలెనె
కదలక మెదలక నిలిచి - కాలగతిని తిలకించును.
అపరాధము బట్టిగాక - అపరాధినిబట్టి జరుగు
అభియోగము, న్యాయ విచారణ, న్యాయాధీశుల తీర్పులు.
కుటిలమతుల ధిక్కరించు - పటుత్వంబులేని టీన
దేశీయుల అగచాట్లను దేబెల దౌర్భాగ్యంబును
సూటిగ వచ్చిన మాటల - చాటిచెప్పినాను నేను.

# నేను ప్రస్తుతాన్ని

నేను ప్రస్తుతాన్ని - గతానికి శిఖరాన్ని
వర్తమానాన్ని - భావికి ఆధారాన్ని
నేను నేడనెడుదాన్ని —
"నిన్నటి స్వప్నాన్ని - రేపటి జ్ఞాపకాన్ని"
నేను ప్రస్తుతాన్ని - ఇప్పటి క్షణాన్ని
నేను గతిని - గతించిన గతానికి పుట్టినదాన్ని
గతి పుట్టించి గతించేదాన్ని - నేను గతిని ప్రస్తుతాన్ని
నేను ఉన్నటాన్ని - బ్రతికున్నదాన్ని
గతి ఉన్నదాన్ని మతి ఉన్నదాన్ని
నేను ప్రస్తుతాన్ని
నేను కలను - నేను కలకాలాన్ని
ఉండి ఉన్నదాన్ని - ఉన్నదాన్ని ఉండేదాన్ని
నేను ప్రస్తుతాన్ని
నిన్న నివురుకప్పిన నిప్పుకణాన్ని - నేటి రాజిన రోజుని
నిగనిగలాడే 'నెగణ్ణి', రేపును రేపే 'దగణ్ణి'.
మునుపు చెల్లించిన ముడుపును - ఇప్పటికి మనుగుడుపును
రేపునుదాల్చిన కడుపును -
నేను ప్రస్తుతాన్ని వర్తమానాన్ని.
గతాన్ని స్వగతంగా గలదాన్ని
భావిని స్వభావంగా గలదాన్ని
నేను జీవనాన్ని జీవనదాన్ని
భావనదాన్ని నేను నవాన్ని
నేను కవనాన్ని నేను ప్రస్తుతాన్ని
నేను అక్షరాన్ని నేను సాగేదాన్ని
నేను నాదాన్ని నేను క్షణాన్ని
క్షణంలో వచ్చినదాన్ని క్షణాన్ని తెచ్చేదాన్ని
గతానికి కాలుణ్ణి, కాదు బాలుణ్ణి
భావి గర్భితుణ్ణి, నేను ప్రస్తుతాన్ని.

# ప్రజాస్వామ్యమంటే...

ప్రజాస్వామ్యమంటేమిటి ?
ప్రజారాజ్యమంటేమిటి ?
సౌజన్యాలకు రక్ష సామరస్యాలకు రక్ష
సహకారాలకు రక్ష సహజీవనానికి రక్ష.
ప్రజాస్వామ్యమంటే అది
ప్రజారాజ్యమంటే అది.
మానవత్వానికి మనుగడ, దానవత్వానికి ఎదదడ
గుండాతనానికి దగడు, గూడుపుఠానికి బెగడు.
కుట్రదారులకు హడలు, చట్రాలను మాడ్చుకొడుట
శాసనబద్ధ వ్యవస్థ, స్వైర విహారున కవస్థ
ముఠాబందికి మృత్యువు, శఠపీఠముల శత్రువు
ఆతతాయి సంహరణ, అనామకుని సంరక్షణ.
న్యాయ వర్తనులకు హామి, మాయముడుత లేని సామి
ప్రతిభకు సరిపడు వెల రసముల చిలికెడు జల.
నిజాయితికి ప్రోత్సాహం, మజానీతి మృత్యూహం
పనిదొంగల కాటకట్టు, పనిదొర కాయువుపట్టు.
సంరక్షిత పౌరమతము, స్వాతంత్ర్యమునకు హితము
హక్కుల కాపాడుచోటు, మక్కువ వికసించుతోట
నెయ్యము పెంచెడి మడి, నీతుల నేర్పెడి బడి
ఆర్ద్రత ఆరని తడి, అమ్మకడుపు దాచిన ఒడి
ప్రజాస్వామ్యమంటే అది
ప్రజారాజ్యమంటే అది.

# ఎందుకో నాహృదిని ఇన్ని ఆవేదనలు

అవనిపై జరిగేటి అవకతవకలు జూచి
ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు
పరుల కష్టముజూచి కఱగిపోవును గుండె
మాయ మోసముజూచి మండిపోవును ఒళ్ళు
పతిత మానవుజూచి చితికిపోవును మనసు
ఎందుకో నాహృదిని ఇన్ని ఆవేదనలు

తప్పుదిద్దగలేను వారిజూపగలేను
తప్పుచేసినవాని దండింపగాలేను
కష్టపడువారలను కాపాడగాలేను
ఎందుకో నాహృదిని ఇన్ని ఆవేదనలు
అవకతవకలు నేను సవరింప లేనపుడు
"పరుల కష్టాలతో పనియేమి మా క"నెడు
అన్యులను గనియైన హాయిగా మనలేను
ఎందుకో నాహృదిని ఇన్ని ఆవేదనలు.

# నరకాసురుని మూర్ఛ

"నాచుట్టూ ఇంకా చీకట్ల ముట్టడే", అంటున్నది వెలుతురు
"కొంతైనా ఊపిరి సలపటానికి
చోటు దొరికింది తొందరపడకు" అంటున్నది దీపం.
"మా చోటంతా ఆక్రమించుకున్నదీ వెలుతురు
కిరణాలు మమ్మ తరిమికొడుతున్నాయి;
ఇదంతా ఈ దీపందే దౌర్జన్యం, దాన్ని మలిపేస్తాం అంటున్నై చీకట్లు
మిడత దండు దిగుతున్నది వెలుతుర్లోకి
దీప కళికపై వాటి 'నిగా'
పొంచుండి గంతేస్తున్నాయి కాలి కూలి చస్తున్నాయి
దీపం శివంబూని తూలిపోతున్నది
వెలుతురు తహతహలాడుతున్నది
"ఇంకొన్ని మిడతలు దూకితే దీపం పని ఖలాస్"
అని సంబరపడుతున్నై చీకట్లు
మిడతలు చవక బారుగ చస్తున్నై
దీపం పక్క-ప్రక్క-గా మరెన్నో దీపాలు
మిడతలు సమిధలై పోతున్నాయి
జ్వాలా తోరణంగావుంది దీపావళి
వెలుతురు పెంచుకుంటున్నది పరిధి
చీకట్లు మరింత ముడుచుకొంటున్నాయి.
"పాడుదీప మారిపోను" అను సాపెనలు వినబడుతున్నాయి

ఎక్కడో దూరాన నలికిన చీకట్ల ఆక్రందన
ఇక్కడ దీపాలచుట్టూ, వెలుతుర్లో
కాలానందం హడావుడి, మతాబాలు, చిచ్చుబుడ్లు
కాకానంచ హర్షోన్మాదం, ఢాం ఢాం ఫటఫటలు.

## ముక్తకాలు

ఇదేం వేషంరా బ్రదర్ !
It Just suits the weather
వెర్రితలల విజ్ఞానుల దీక్ష - ప్రకృతి మాత స్తన శల్యపరీక్ష.
వెలుగునీడల కలయిక - వెలుగునీడల కేమెరుక ?
మూకప్రజల పాలిటికి - తోకచుక్క నాయకుడు
నడపడిదాచే నుడువులు - ఒడలిని దాచే ఉడుపులు
ఆద్యంతములందు సముడు - ఆదిత్యునివోలె ఘనుడు.

## అద్వైతం

నీకూ నాకూ వానికి నీతుల్లో ఉన్నతేడ
కూతల్లో ఉన్నతేడ చేతల్లో కనబడదేం ?
జ్ఞానకాండ ఏదైనను గానసర? ఏదైనను
కర్మకాండ ఒకటేనని కనిపించును కలయజూడ.
కులదైవంబేదైనను కొలుచుతీరు వేరైనను
కలదయ్యం ఒకటేనని కనిపించును కలయజూడ.
మనిషి మనిషి వేరైనను ఉనికిస్థాయి ఏదైనను
మనసుమాత్రమొకటేనని కనిపించును కలయజూడ
నీకూ నాకూ వానికి నీతుల్లో ఉన్నతేడ
కూతల్లో ఉన్నతేడ చేతల్లో కనబడదేం ?

# తలపు పలుకు

తలచి తరచి తలపులన్ని పలుకుల్లో ఒలికిస్తే
ప్రాణాలే ఝల్లుమనును గుండెమువ్వ ఘల్లుమనును.
వలపు బిగువుల బిగింపు కలకండను వలచి వలచి
తలప్రాణం తోకకొచ్చి చెరుకుగడను ఆశ్రయించి
నారిగమారిన నారిని కొలికిమీటారిని మీటగ
పూలబాణ మెక్కుపెట్టగ
శివుని మనసు నొచ్చుకొనెను చిచ్చుకన్ను విచ్చుకొనెను.
సతిమనస్సు చివ్వుమనెను - రతి మతి చెడి కెవ్వుమనెను
తలచి తరచి తలపులన్ని పలుకుల్లో ఒలికిస్తే
తలపులేవొ మొలిపిస్తే తలుపులన్ని తెరిపిస్తే
మలుపులన్ని చూపిస్తే
అగ్గికొస్త కెలికిస్తే - సిగ్గులన్ని వొలిపిస్తే
ముగ్ధమనసు పెకిలిస్తే మొగ్గలు ఫక్కున నవ్వును
పువ్వులు రెక్కల రువ్వును
వలపు బులుపు తీర్చుకొనును వ్రతము చితిని పేర్చుకొనును
'మనువు' మతము మార్చుకొనును మనిషిమనుట నేర్చుకొనును
తలచి తరచి తలపులన్ని పలుకుల్లో ఒలికిస్తే
ప్రాణాలే ఝల్లుమనును గుండెమువ్వ ఘల్లుమనును.

# తిమిర జ్యోతి

పండు వెన్నెలదాల్చి ప్రసవవేదవ తోడ
నెలవంక కనబోవు విందుపొద్దుల రేయి.
ఒకవంక తెగతెంపు ఒకవంక బిగియింపు
హాహాల చెలిమిలో హాయి తొణికిసలాడు
తిమిరాల కడుపులో తేజాలు జనియించు
అమావాస్య నిశికింత హడలేల బెగడేల?

# కాలం మారింది

ఎవనిమాట ఎవడూ నమ్మని కాలంలో
సత్యము చెప్పటమే ఎదుటివానిని మోసగించడం;
అందరు Wrong side పోతుంటే
Side పాటించేవాడే అపఘాతాలకు కారకుడు;
తప్పుడు లెక్కలు వ్రాసే చిత్తాలో
ఒప్పుపద్దులు చేర్చేవాడే నేరస్తుడు;
సూర్యునివలె దీపాలు వెలుగుతుండగా
చాంద్రమానం ప్రకారం చంద్రోదయం దాకా
దారి కనబడదని ప్రయాణం ఆపుకునేవాడే మూర్ఖుడు.

# ఉడుంత భక్తి

వారధికని వచ్చిపడెడి రాయికి రాయికి మధ్య
పరాయితనము తగ్గింపగ ఉడుత రాల్చినట్టి ఇసుక,
రామన్నకు కన్నతల్లి లాలన గుర్తుకురాగా
కొసినోటి అమృతాన్ని సేవించిన రేగుపండు,
ఊసులు తోడిన కన్నులు రక్తము కారెడి శివునకు
కాళహస్తిలో కన్నడు కోసిచ్చిన కన్నుదోయి,
ఆకలి గొన్నట్టి అన్న కందింపగ మిగిలిఉన్న
పూరిగుడిసె ద్రౌపదమ్మ అంట్లగిన్నెలోని అంటు,
అతిథిని సంతృప్తిజేయ అపరిగ్రహవ్రతుని గృహిణి
అన్నపూర్ణ అందించిన పరిగెగింజ పిండివంట
గాయపడిన అన్నవ్రేలు చుట్టియగ చెల్లాయి
చేతులార చించుకున్న ఒంటిమీది చీర అంచు,
కూటిపేద కుచేలయ్య తడబాటును లెక్కింపక
లచ్చిమొగని నోరూరగ చేసిన, పిడికెడు అటుకులు
ఏటూరీనాగారం కోయదొర యుద్ధనిధికి
అందింపగ ఏటేటా కూడేసిన లచ్చివెలుగు,
శరణార్థిని అని అనబడు పురుషార్థిని పూలదేవి
దాదియమ్మ భరతమాత నూటానలుబది రూకలు,
కానిరోజు కటకటతో పోరాటము సలిపి బ్రతుకు

బిచ్చమెత్తుకొను లచ్చిమి దయతో పెట్టిన నూకలు
కాశీనగరపువాసి కాపుబిడ్డ, కరుణమూర్తి
శివ్వన్న శివముబూని ఇచ్చేసిన ఒంటెద్దు
వైయాకరణులు నవ్వగ ఛాందసులు ఇగిలింపగ
ఆతరపడి ఎడదచించి కట్టిన అక్షర రక్ష.

## ఏటూరు నాగారం కోయదొర

అతినవీన యంత్రతంత్ర అయోజిత సంజయని
పలుకుచెవికి సోకనట్టి పలువురు ధృతరాష్ట్రులకు
కనులగుపడ చెవివినపడ మనసుకరుగ జేసెనెవడు ?
రేడియోల కోడికూతకూడ చేరలేనిచోటు
వాడాతడు హరిజనులకు తోడాతడు
గిరిజనులకు జోడాతడు కనులులేని వాడాతడు
కనులుఉన్న ఎందరికో కనబడనిది, ఎంతో చూచెను అతడు
ఎవడువాడు ? ఎచటివాడు ? ఏమిజేసె ? ఏమికథ ?
ఏటూరు నాగారం ఏమిటది ? ఓ ఊరా ? ఎచటున్నది ?
గోదావరి ఏటొడ్డా ? బేచిరాగు చిట్టడవుల నడిబొడ్డా ?
ఆదిమవాసుల నేలా ? అక్కడ ఒక కోయదొరా ?
అంధుడా ? కర్షకుడా ? అతివృద్ధుడా ?
మూడేండ్ల ఆదాయం యుద్ధనిధికి ఇచ్చేసినాడా
నాగరికులు ఎరుగని ఏటూరు నాగారంవాడా అతడు ?
రావణు బలగము నెదురగ – రామన్నకు లచుమన్నకు
సాయపడిన కోయదొరల – సంతతివాడా ? అతడు
ఔనౌను ఔను అతడె – అడవుల నివసించువాడె
ఆధునికుల మనుకొనుమన
అహంకారమును బాపిన ఆది మానవుడు అతడె
ఆదిశక్తి ఆదిపురుష దాంపత్యమునకు ఫలము
దైవకార్య నిర్వహణములోని
లోతు తెలిసికొన్న ఋషి అతడె
ఆకసమున ఎగిరిపోవు రావణుని
ఎగిరి ఎగిరి తాకినట్టి జటాయు వతడె
నేడు చౌ ఎన్ లై పటాలాల నాపుటకై
కట్టబడెడు కోటగోడకూడ అతడె.

(1962)

# ఈప్స

నాకున్నది కోరిక
నా గొడవనీకు రాసిన ఉత్తరంగా ఉండాలని
చదువరులకు కవిత్వంగా ఉండాలని, భావుకులకు మెదడుగా ఉండాలని
మేధావులకు ఎదదగా ఉండాలని
తార్కికులకు కరుణ పుట్టించేదిగా ఉండాలని
అమాయకులకు ఆపద గుర్తించేదిగా ఉండాలని
చౌకబారు ఇగిలింతలకు గాంభీర్యం గూర్చేదిగా ఉండాలని
గాంభీర్యాడంబరాల సైతం, చిరునవ్వు నవ్వించేదిగా ఉండాలని
మూర్ఛిల్లిన స్నేహాలకు సంజీవినిగా ఉండాలని
రగిలిన కనులను చల్లార్చేదిగా ఉండాలని
విచ్చలవిడి ఆంబోతుకు గుదిబండగా ఉండాలని
గాలిలో తేలే పరిమళంగా ఉండాలని
పొదుగుల్లో చేపులుగా ఉండాలని
అమ్మ కంటిచూపుల్లా ఉండాలని
రైతుచూపు కాపుల్లా ఉండాలని
క్రుంగిన ఎదకు దిలాసాగా ఉండాలని
బ్రతుక్కి బాసటగా ఉండాలని, యమునికి పాశంగా ఉండాలని
ఎడారులకు చెలిమెగా ఉండాలని
మంచుకు కుంపటిగా ఉండాలని
జాతికి నీతిగా ఉండాలని, శత్రువుకు భీతిగా ఉండాలని
సరిహద్దుకు రక్షణగా వుండాలని, శిబి శరీరంలా ఉండాలని
బలిత్యాగంలా ఉండాలని, రణవీరుల ప్రాణంలా ఉండాలని
అమరుల హారంలా ఉండాలని, వేదన వేదంలా వుండాలని
గంగకు జీవనంగా ఉండాలని
జీవనమునకు తీరంగా వుండాలని
పాతాళాన్ని పైకిలాగేదిగా వుండాలని
దివిని భువికి దించేదిగా ఉండాలని
ధాత్రిని ధాత్రిగా వుంచేదిగా ఉండాలని
మనిషిని మనిషిగా చేసేదిగా ఉండాలని
నాకున్నది కోరిక.

# బతకమ్మా! బ్రతుకు

గుమ్మడిపూలు పూయగ బ్రతుకు
తంగెడి పసిడి చిందగ బ్రతుకు
గునుగు తురాయి కులుకగ బ్రతుకు
కట్ల నీలిమలు చిమ్మగ బ్రతుకు - బతుకమ్మా! బ్రతుకు
అమ్మను మరవని సంతానము కని బతకమ్మా బ్రతుకు.

పచ్చని పసరిక బయళ్ళ బ్రతుకు
పల్లెపట్టుల పంటల బ్రతుకు
పసుపుతోట మరియాదగ బ్రతుకు
పున్నమవెన్నెల మాదిరి బ్రతుకు – బతకమ్మా! బ్రతుకు.

మూడుముళ్ళ బిగియింతల పద్దుల
ఇంటబ్రతుకు తాహత్తుల హద్దుల
మమతల, మమతల పెండెడి సుద్దుల
తీరు తీరు చవులూరెడి చద్దుల - బతకమ్మా! బ్రతుకు.

పసుపుకుంకుమల వసతుల తేలుచు
పారాణిలో మారాణిగ పారుచు
అలమంద గొంతుల 'అంబా'డుచు
దాంపత్యపు దివ్వెల వెలయించుచు - బతకమ్మా! బ్రతుకు.

తండ్రుల తాతల జేయుచు మురియుచు
కొడుకుల తండ్రుల జేయుచు వెలయుచు
అమ్మల అవ్వల జేయుచు కాయుచు
బిడ్డల తల్లుల జేయుచు సాకుచు బతకమ్మా! బ్రతుకు.

నొసటి కుంకుమల తళుకుల నీనుచు
మంగళసూత్రము వలపుల పేనుచు
గాజుల గలగల నవ్వుల తేలుచు
కాలిమట్టియల పలుకుల కులుకుచు బతకమ్మా! బ్రతుకు.

మక్కలరాసుల పసిడిగ బ్రతుకు
గేగులకండల జవగా బ్రతుకు
'సీతాఫల' కనుగ్రుడ్డుగ బ్రతుకు
పాలపిట్ట గింజూరగ బ్రతుకు - బతకమ్మా! బ్రతుకు.

నల్లపూసల నడుమనె బ్రతుకు
పాలతిన్నియల బాపునె బ్రతుకు

నొసటిమధ్య మందారము । బ్రతుకు
కాళ్ళపసుపు పారాణీ । బ్రతుకు_బతకమ్మా । బ్రతుకు.
పాటపాడి పాటల పాడిస్తూ
ఆటలాడి ఆటల ఆడిస్తూ
జంటగూడి జంటల కూరుస్తూ
బతుకు బ్రతికి బతుకుల బ్రతికిస్తూ – బతకమ్మా । బ్రతుకు.
చెలిమి చెలములు ఊరేదాకా – చెలిమి కలుములు నిలిచేదాకా
చెలిమి వెన్నెలలు కాసేదాకా
చెలిమి రాగములు ఒలికేదాకా – బతకమ్మా । బ్రతుకు.
మన్నూ మిన్నూ ఉండేదాకా
సూర్యుడు చంద్రుడు వెలిసేదాకా
చుక్కలు మింటిలో కులికేదాకా
కాలచక్రము తిరిగేదాకా – బతకమ్మా । బ్రతుకు
అమ్మను మరవని సంతానముకని – బతకమ్మా । బ్రతుకు.

## తస్మాత్ జాగ్రత ! జాగ్రత !

అభ్యర్థి ఏ పార్టీవాడనికాదు ఏపాటివాడో చూడు
ఎన్నికుంటె వెలగబెట్టటంకాదు
ఇందాకా ఏం చేశాడో చూడు
ఇప్పుడు కట్టే ముడుపులు కాదు
ఇందాకా చెల్లించింది చూడు.
పెట్టుకునే టోపీకాదు – పెట్టినటోపీచూడు
ఎగరేసిన జండాకాదు చాటున ఆడించిన దండా చూడు
మనిషినిచూడు చరిత్రను చూడు
నుడువులుకాదు నడవడి చూడు.

## నీ పేరు తలచుకుంటె చాలు

ఎనుబదేండ్లు బ్రతికికూడ నీవు చేయలేని పనిని
చేరలేని గమ్యాన్ని, సాధించలేని లక్ష్యాన్ని
మా యందున గాంచలేని ఫలితాన్ని – మాపై వేయలేని ప్రభావాన్ని
ఆ క్షణాన నీ చావే సమకూర్చెను అనిపించెను_
ఆ క్షణాన అవినీతికి గుండె ఆగినట్లాయెను

మాయా మోసము, ఛలము వసతిలేక దిగులుపడెను
విభేదాలు ఆవిరియై శూన్యాలను వెతికికొనెను
ఇదే సమయమన్నట్లు పగలన్నియు
మటుమాయమైపోయెను; వగలు జగమునే వీడెను.
ఈర్ష్యాద్వేషాల కొలిమి చప్పున చల్లారినట్లు
భూగోళం యావత్తు ఒకేవ్యక్తి అయినట్లు
భారతమాతే జగతికి గుండెకాయ అయినట్లు
ఆగుండియ పగిలినట్లు — చుక్కలన్ని భూగోళం కన్నులౌచు ఏడ్చినట్లు
ఆకాశం మొగంనిండ దిగులు అచ్చుకమ్మినట్లు
ఆక్షణాన సాగరాల హోరంతయు మానవమాత్రుని దుఃఖమే—
ఆ క్షణాన జీవుని వేదన సాంతము నీవులేవనియే
మముకావగ రావురావు రావనియే
ఇరువది ఏడులు గడిచెను; అయినా
ఈనాటికి నీపేరు తలచుకుంటె చాలు
మా భయాల చిమ్మ చీకట్లలో నీ అభయ హస్తపు మెరుపులు
తళుక్కుమంటాయి, బాపు! తళుక్కుమంటాయి. (1968)

# ముఖే ముఖే సరస్వతీ

నోట నోట మాటమ్మ — లేనినాడు
నాల్గుదిక్కులందు వెలయు
నాలుగు మొగములు తలలు
కనులు చెవులు యెనిమిదేని
(కను లెనిమిది చెవులెనిమిది)
కాని మాటలేనప్పుడు — లేనినాడు
వావావా వాలవాడు
వాక్కులేక అల్లల్లాడు
వాణి పుటుకతోనె వాడు — బ్రహ్మై భాసించినాడు.
వాణి బైటబడెను ముందు — జ్ఞాన మొదలె వాణియందు
వాణి బైట బడక ఆగ — నాల్గునోళ్ళవాడు మూగ
తాతనోటినుండి — నానాటికి నోటి నోటి
వాడుక వేడుక వాణికి — పరిమితి పూజ్యము దానికి
ముఖే ముఖే సరస్వతి — నోట నోట మాటమ్మ.
అక్షరశ్రీ విభూషా వాణీ! నానా వర్ణమాలినీ వాణీ!

అనంత పద శోభినీవాణీ। రసస్రోతస్విని బ్రహ్మణీ వాణీ।
భారతీ, శారదా, వాణీ। వీణా పాణినీ రాణీ।
సంగీత సాహిత్యస్తనీ। మాతారసమయీ, బ్రహ్మణీ
ముఖే ముఖే సరస్వతీ — నోట నోట మాటమ్మ.
వడ్ల వంగడాలకన్న — మాట వంగడాలు 'శాన'
తాతతాన, నాతాన - నీతాన వాణి 'రికాన'
(వానితాన)
(నోరే వాణికి రికాన)
(నోట నోట మాటమ్మ)
గిరిజనులకు గిరిజకన్నా — మాటమ్మే కడు దగ్గర
జనతా జనార్దనునకు - చంచశ్రీలక్ష్మికన్నా
మాటమ్మే కడు దగ్గర - చుట్టపు చూపుల పేడుక 'మాటమ్మ'ది
సర్వ మంగళ పార్వతి
దయాదృష్టి వినుటెకాని, కవి ఎరుగము.
మాటమ్మ మనుజులపై ఎల్లప్పుడు మమత గలది
చనుబాలతో అబ్బి, మనము — చనిపోయేదాక మనది
ముఖే ముఖే సరస్వతీ - నోట నోట మాటమ్మ.
చెవినోకిన వాణి 'శ్రుతి'గ - తల జొచ్చిన వాణి 'స్మృతి'గ
తాతనోటి నాటినుండి - నానాటికి చలామణి.
నిత్యనూతన సనాతన - వైభవోపేత వాణి -
స్నేహశీలా వరదాయినీ - ప్రసాద హృదయ శోభినీ.
ఎరుకలది - తాత లెరుకజెప్పుపాటి
ఎరుకగలది - మాటలది,
తాతను మాటాడించిన మాటలది, నేర్పలది,
తాతకు వేదాలనేర్పు నేర్పులది, విద్దెలది
నాటి నేటి రేపటివగు విద్దెలది
వేద వేదాంగములందున విదితమైన వేడ్కతోనె
జానపదుల నాల్కలపై నాట్యమాడు నడవగలది.
రంగురూపు వ్యత్యాసము, చేయక స్నేహించు వాణి
కలిమి లేములను గనక, చను కుడిపెడి తల్లివాణి.
పండిత పామర భేదము — ఎరుగని సహృదయ వాణి
అర్థాంతర లావణ్యము - చిందించెడి జాణవాణి.
గణపతికి, బృహస్పతికి - ఆదిశేషునకు, బ్రహ్మకు
మాటలునేర్పిన మమతయె - మన యెడలను చూపెడిది

పుట్టించుట ఘనమా ? మాట పుట్టించుట ఘనము - కాన
బ్రహ్మకన్న బ్రహ్మణియె ఘనురాలు ముమ్మాటికి.
నోటమాటలేక మనెడి - తాతయ్యకు మాటలన్ని
నేరిపి, వేదము చెప్పగ - జేసిన ఘనురాలు వాణి.
పుట్టి, మూగనోట మనుట - గిట్టుటకన్నను ఘోరము
ఆ పట్టున ఆదుకొన్న వాణి కరుణ అపారము.
అక్షరశ్రీ విభూషిత - పదవిన్యాస విలాసిని
పుటుకతోనె నాల్గునోళ్ళ రాణించిన మారాణి.
అన్నివర్ణమ్ములు వాణివి - పదములన్నియును వాణివి
గురులఘువుల లాఘవము - గుంభన, గుంతన వాణిది.
అక్షర రమ్యత వాణిది - అమృత వర్షము వాణిది
తాతమాట, మాటతేట పరచిన జ్ఞానము వాణిది
ముఖేముఖే సరస్వతీ - నోటనోట మాటమ్మ.
పుటుకతోనె నాల్గునోళ్ళ - రాణించిన రాణి వాణి
యాసల విన్యాస విలాసిని - వాణీ సర్వత్ర సుభాషిణి.
నానా వర్ణముల మాటలతో, అనంత పదముల శోభతో
అర్థవంతమగుచు, వివిధ రసములొలుక జేయునది.
తాత నోటినుండి బైట పడిన దాది నానాటికి
నోటనోట బైటపడుచు నిగ్గుదేలు పరిపాటిది.
ప్రతినోటికి పట్టు బడియు, ఏ నోటను పడియుండక
రకరకాల యాసలతో బైటపడెడి వైనాలది.
బహువిధ రూపవిలాసిని - యాసల వయ్యారాలది
రామచక్కదనాలది, పల్కుల సింగారాలది.
తాతనాటి గోలె, కోట్ల కోట్ల గొంతుకలు పెకలగ
జిహ్వాగ్రము నాట్యభూమి జేసుక నర్తించువాణి.
యాసల వయ్యారాలతొ అందచందములు పుంజుక
వ్యంజన, వ్యంగ్యము, కాకుపు ప్రాభవమున వెలయు రాణి.
ఏమాటకు ఆమాట ఒకటె కాని, దాని ఆట -
కోటితీర్లు, మాటాడెడి నోళ్ళు కోట్లు, కోటానకోట్లు
ముఖేముఖే సరస్వతీ - నోటనోట మాటమ్మ.
మాట 'చమక్కు'లలోగొని చుక్కచుక్క తళుక్కుమను
సింగిణియును నేలముట్టి, వర్ణమాల సొగసులగను
తాతనోటి పలుకుల పస, నుడికారము వాడి, వాడి
నానాటికి నుడుల వడితొ

ముఖేముఖే సరస్వతీ - నోటనోట మాటమ్మ.
పండించిన పంటంతయు తల, తల, తలపుల తీరు
వండించిన వరటంతయు జిహ్వా జిహ్వా రుచుల తీరు
వ్యంజనముల వెలితి ఏది, లేకుండెనె సాహిత్యము,
వలచిన రసమును తనదిగ జేసికొనుట రసికత్వము
తమ తమ రుచులను బట్టి వడ్డన జేసిన విస్తరి నుండి
ఎన్నుకొని తినుట విందుల సభ్యత - మాన్యము.
అది లోపము, ఇది అధికము - అని వగచుట అధమత్వము.
ముఖేముఖే సరస్వతీ - నోటనోట మాటమ్మ.
సర్వమంగళ సమేతుడు పరమేశుడు
శ్రీయుతుడు శ్రీమన్నారాయణుడు
సకల సృష్టికర్త బ్రహ్మ యిత్యాదులు
అక్షరాల వాగీశ్వరి పదజనితులు.
పదముల పదును చెమర్చగ - నుడికారము ఘాటొప్పగ
వడి, వాడి, వాడుక బడి, మాటల వేడుక తీరగ
నోట నోట మాటమ్మ - ముఖేముఖే సరస్వతీ. (1971)

# వావిలాల

సంతత దరిద్రనారాయణ - చింతామృతస్వాదనంబు
విశ్వేశ్వరు మరపించెడు - విరాట్ రూప దర్శనంబు.
పిడికెడు ఎముకలలోను - పిడుగుల రాల్చెడు తుఫాను
చెడుగు బలుల తలదన్నెడు - వడిగల అడుగుల వడుగు.
రాజకీయాధికార గజరాజము మద మణచగ
శాస్త్రబద్ధ అంకుశంబు - సంధించెడు మావటీడు.
ప్రజానీతి మునిగి తేలు - హజారంబు దద్దరిల్ల
ప్రజాకోటి హితము మాట - బజాయించి పలుకు మేటి.
మనిషికి మనిషిగ మనుటకు - అనువగు వనరులు ఏర్పడ
మనుగడ చేబూని మసలు - మొనగాడు సేవావ్రతుడు.
గాడిచెర్ల, చెరుకువాడ - జాడ దెలుపు సంప్రదాయ
సిద్ధు డతడు ప్రజల మనిషి - శీలధనుడు త్యాగమూర్తి
స్వాతంత్ర్య సమరయోధ - సమూహంపు చేవ, ధీమ
అమరిన అమలిన వర్తన కానవాలు వావిలాల.

# ?

"Where mind is without fear
And head is held high." — Tagore,

పత్రిభూ ।
మనసు నీచే పురోగమింపబడి నప్పుడుగద
విశాలమగు చిత్తవృత్తికి
ఉదారమగు కృతికి ఆస్కారం అప్పుడు గద.
నా దేశము మేల్కొనుటకు తగిన
స్వాతంత్ర్యపు స్వర్గసీమ ఏర్పడునది
అందాక, మనసుకు భయం తప్పదు.
మనిషికి తలవంపులు తప్పవు
అందాక, జ్ఞానానికి తప్పదు
బానిస చదువుల సంకెళ్ళ పీడ.
మనిషిని మనిషిని విడదీసెడి అడ్డుగోడ తప్పదు
అందాక సత్యానికి దగ్గుత్తిక తప్పదు
దాని గొంతు నుండి ఏ మాటయు పెకలదు
అందాక – అలసిన కృషి పరిపూర్ణత వైపు
చేతులు చాచలేదు
అందాక – చాదస్తాల ఎడారిలో
వివేకాల పిల్లవాగు ఇంకిపోక తప్పదు
అందాక – లేదు లేదు
నా దేశానికి మేలుకొలుపు వీలు లేదు.

# కోటగోడలు నేల కూలుతున్నాయి

అధికార మున్నదని హద్దుపద్దు లేక
అన్యాయ మార్గాల నారింప బూనిన
అచ్చివచ్చే రోజు లంత మైనాయి
అచ్చివచ్చే రోజు లంత మైనాయి.
కాజేయువారలను కష్టించువారల
కంట బడనీకుండ కాపాడుచుండిన
కోటగోడలు నేల కూలుతున్నాయి

కోటగోడలు నేల కూలుతున్నాయి.
శస్త్రాలు నిర్మించి, సైన్యాలు సమకూర్చి
ఉర్వి నంతయు గెల్వ యుద్ధాలు ప్రకటించి
దుష్టశక్తులు పోరి దొర్లుపొయ్యాయి
దుష్టశక్తులు పోరి దొర్లుపొయ్యాయి.
కొరడదెబ్బలు తినుచు గురువు సాపెన వినుచు
"బాంచెనయ్యా" అనుచు ప్రణమిల్లు ప్రాణాలు
ఇప్పుడిప్పుడె తెప్పరిల్లుతున్నాయి
ఇప్పుడిప్పుడె తెప్పరిల్లుతున్నాయి.

# పునరావృతి

ఉదయం
కానే కాదనుకోడం నిరాశ
ఉదయించి
అట్లానే వుండాలనుకోడం దురాశ
ఈ చీకటి ఉండదు -
సూర్యుడు తప్పక ఉదయిస్తాడు
ఆ వెలుతురు నిలవదు -
సూర్యుడు మళ్ళి అస్తమిస్తాడు.
చీకటిలో కను విప్పిన వారికి
వెలుతు రంటే బూచి
లుతురులో కను తెరిచినవారికి
చీక టంటె పిశాచి
ఇదే జరుగుతూ వచ్చింది
ఇంతకుముందు
ఇదే జరుగుతుంది
తప్పదు ఇకముందు.



# తెనుగునాడు మనది ఐననాడు

ఆనాడూ ఈనాడూ ఏనాడును లోటులేదు
వ్యక్తివ్యక్తిస్నేహానికి మనిషి మనిషి శ్రేయానికి
సర్వజనుల సౌఖ్యానికి భారతసౌభాగ్యానికి
ఆ ఈ నాడుల మధ్య లంకె కుదిరి మెలగునాడు
ఆంధ్రుని అభ్యుదయానికి ఏనాడును లోటులేదు
ప్రకృతిమాత ఆర్ద్రహృదయ
కరువు కాటకాలతోడ ప్రజలు తల్లడిల్లుచుండ
ఆమెకు నిద్దుర పట్టదు :
ప్రకృతిమాత ఆర్ద్రహృదయ
పుడమి పాప పసినోటికి అందగచేపెడి చన్నులు
ఆర్ద్రిత పైకుబికి పొంగు కొండల రొమ్ముల తిన్నెలు :
తిండికరువు రూపుమాపు
పాటిమన్ను విత్తనాలు
కర్రు పదునుగలకాపు
కండరాల చెమటజాలు
ఏదేదని వెదకి కొనుచు సహ్యాద్రి గుండెపగుల
యుగయుగాలనుండి కృష్ణ కడుపు చెరువుగా ఏడ్వగ
కడలిదాక ఒకేధార.

యుగయుగాల తృష్ణతోడ దరిదాపుల పుడమి తాను
మాగాణిగ మారలేక నెర్రెల నిట్టూర్పులతో
మండుగాలి నింగిదాక :—
లోయల్లో చేరిదూరి డొంకల్లో దాగి పారి
పర్రల్లో గెంతిపాకి అడ్డమైన గట్లుదూకి
"అయ్యో నా జీవనమ్ము పుష్కరాల తీర్థాలక ?
అయ్యో నా తీరమంత అపర కర్మకాండకేన ?"
అనిఏడ్చెడి కృష్ణ నీరు ఇన్నినాళ్ళు కడలిపాలు.

మున్నీటిని చేరనీని ఆనకట్ట వుండెవాలు
జీవనదుల పారునీరు సస్యాలకు చనుబాలు.
ఈనాడా ఏనాడో వేలాది ఏండ్ల క్రింద
ఆగుట్ట ఈగుట్ట సాగికలసి నిలచినట్లు
కట్టలు పోసెను ఆంధ్రుడు. పాకాల, లఖ్నారం
రామప్పవంటి వెన్నో సాగరాల బోలుచెర్లు.
పుట్టుగుణమో, మట్టిగుణమో ?
నీటి గుణమో, గాలిగుణమో ?
అన్నపూర్ణ నామాంకిత ఆంధ్రావని సౌభాగ్యమొ ?
సేద్యమంటె సంబరపడు కాపుబిడ్డ తెనుగువాడు.
చెట్టుకొట్టి మెట్ట తవ్వి, కంప పొదలనరికి కాల్చి
పుడమిదున్ని పండించిన మొదటివాడు తెలుగువాడు
వనరులున్న వాడొక్కడె పుడమి కరువు తీర్చగలడు.
శ్రీరాములు ఆత్మార్పణ ఫలితం భారతి శ్రీమతి
మాటమ్మను కొలువ లచ్చివేడ్కలు, సత్తికి పరపతి.
రకరకాల సభ్యతల ప్రభల వెలయు భాగ్యనగరి
భక్తుల దోసిళ్ళనింపు మార్గళి పులగంతో సరి.
ఎదపదును కంటిపదును గలబీదలు పడుపాటులు
నుదులతీపి తేటతెల్ల మొనరించెడి పనిపాటలు.
అక్షరమగు చేతజేయ నోపిన లక్షల చేతులు
ఏండ్లుపూండ్ల కట్టడితో గుట్టల వరుసగ కట్టిన
ఆనకట్ట ఫలితంగా రస సిద్ధుని నాటి కలలు
నిజము చేయబూని
'నాగార్జున' సాగరమై వెలయుచుండె కృష్ణవేణి.
ఆకలితో ఆకులపడు పనిలేదిక
భారతాంబ తిరిపమెత్తు పనిలేదిక.
తెనుగన్ని విద్దెలను గరిపెడు బాసగా అయిననాడు మనది తెనుగునాడు
నెత్రెలై నిట్టూర్పు నేల చేరెడు గూడలేనినాడు మనది తెనుగునాడు
పనిదొంగలకు బ్రతుకుతెరువులన్నియు బందు అయిననాడు
మనది తెనుగునాడు

షనిమంతుడెవ్వడును ఏలేమికిని గురికావినాడు మనది తెనుగునాడు
భారతావని ప్రగతిభావనా బలముతో మెలగునాడు మనది తెనుగునాడు
ఆంధ్రాభ్యుదయమ్ము అందరిమేలు గన్ననాడు మనది తెనుగునాడు
దేశమంటే మట్టికాదు మనుషులు అన్న మొదటినాడు మనది తెనుగునాడు
మనిషి మనిషిగ బ్రతుకవీలు సౌకర్యమ్ము ఉన్ననాడు మనదితెనుగునాడు
బ్రతుకు మంగళసూత్ర బద్ధబతకమ్మయై వెలయునాడు మనది తెనుగునాడు
తెనుగునాడు మనది మనది ఈనాడు వేరువేరగునాడు వేరు ఈనాడు
కొదువ పూజ్యమ్ము, గొడవకు తావులేదు, ముదము మురిపము పబ్బాల సంబరమ్ము
అన్నపూర్ణమ్మ మన ఆంధ్ర పూర్ణకుంభ, సుజల సస్యశ్యామలంబు.
లోటేమున్నది
ఆంధ్రుని అభ్యుదయానికి
భారతి సౌభాగ్యానికి
లోటే మున్నది?
కలిసి నిలచి గర్వముగా శిరములెత్తి అందామా నింగిదద్దరిల్లిపోగ
కలసి నిలచి భక్తితోడ గళములెత్తి పాడుదామా? పాడుదాము.
వందే మాతరమని
సుజలాం సుఫలమ్మని
సస్యశ్యామలమ్మని
వందే మాతరమని
పాడుదాము పాడుదాము
తెనుగునాడు మనది అయిననాడు
'జైహింద్'
వందేమాతరం.






వేమన్న వేదం
రసార్ద్రమైన
ఆరుద్ర
వ్యాఖ్యానం

# మా మాట

మా సాహితీవాహిని పరంపరలో ఐదవ తరంగంగా కాళోజీ "నా గొడవ" ను ప్రచురించగలుగుతున్నందుకు హర్షోత్పుల్ల హృదయంతో పొంగిపోతున్నాం. "జీవన గీత"తో ఖలీల్ జిబ్రాన్ భావాలను తొలిసారిగా తెలుగు పఠితృలోకానికి పరిచయం చేసిన కాళోజీ మా యువభారతికి గౌరవ సభ్యులు. ఆ "జీవనగీత"ను ప్రచురించే భాగ్యాన్ని మాకు కల్గించిన ఉదారహృదయుడు. మా సాహితీ కార్యకలాపాలకు తన ఆశీరమృతాన్ని అందిస్తున్న సాహితీప్రియుడు.

తన వాణి పండితులకూ, పామరులకూ అందాలనే ఆకాంక్ష కాళోజీది. పాండితీ స్ఫోరకమైన పదబంధాలతో తన అనుబంధం తెంచుకొని, పామరుల జిహ్వాగ్రాలపై లాస్యమాడే నుడికారాన్ని సొంతం చేసుకొన్న కవి కాళోజీ. తన అనుభూతులకు మాటలు తొడిగి, సరికొత్త రూపకల్పన చేసి, నిర్మోహమాటంగా, పఠితల గుండెల్లోకి సూటిగా దూసుకుపోయే విధంగా కాళోజీ కవితారచన చేశాడు. మాత్రాగణ బద్ధాలుగా, వచన కవితలుగా వెలసిన ఆయన కవిత్వంలో వైవిధ్యం ఉన్నది. ఆర్ద్రత ఉన్నది. ఇతరుల మనస్సులను నొప్పించని హాస్యమున్నది. సమకాలీన జీవనంలో తానూ ఒక వ్యక్తిగా భాసిస్తాడేగాని తా నేదో మబ్బుల్లో తిరుగుతున్నవాడిలా వ్యవహరించడు. నిరంకుశ నైజాం ప్రభుత్వాన్ని తన మాటల ఈటెలతో ఎదుర్కొని కారావాసక్లేశాన్ని అనుభవించిన స్వేచ్ఛాజీవి. మనస్వి. హిందీ, ఉర్దూ, మరాఠీ మరియు ఇంగ్లీషు భాషాసాహిత్యాలతో చిక్కని పరిచయమున్న కాళోజీ రచనల్లో, ఆ యా సాహిత్యాలను అవలోడన చేసిన సంస్కారం, విశాల దృక్పథం కనిపిస్తాయి.

"నా గొడవ" అనే పేరుతో కాళోజీ ప్రచురించిన ఏడు కవితాసంకలనాల్లోంచి, ఇంకా ఇతర పత్రికల్లో ముద్రితాలైన కవితలను కొన్నింటిని ఏర్చి కూర్చి "నా గొడవగా" ఈ సంకలనం వెలువడుతున్నది.

తనకవితలతో స్వాతంత్ర్యోద్యమానికి చేయూత నిస్తూ, తన మంచిమనసుతో స్నేహితుల మనస్సులను రంజింప జేస్తూ, తన కన్నీళ్లనూ పన్నీళ్లనూ ఇతరులకు పంచుతూ కాళోజీ అరవయ్యేళ్లు గడిపినాడు. ఈనాడు ఆయన షష్టిపూర్తిమహోత్సవ సందర్భంగా యువభారతి చంద్రుని కో నూలుపోగులా ఆయనకవితలనే ప్రోగుచేసి ఉపాయనంగా అందిస్తున్నది.

కాళోజీకి పరాత్పరుడు, పరిపూర్ణమైన ఆయురారోగ్యాలను ప్రసాదించి, ఉత్తరత్రా ఆయన ప్రజాకవిత్వంతో సాహిత్యాభిమానులకు రసానందాన్ని పంచిపెడుతూ వుంటాడని ఆశిస్తున్నాము.

ఇరివెంటి కృష్ణమూర్తి

9 - 9 - 1974

అధ్యక్షుడు

యువభారతి



# యువభారతి పరిచయము

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం, పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

పక్షానికి ఒకమారు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయంలో సాహిత్య సమావేశాలను ఏర్పరచి, యువభారతి తన సభ్యులకు సక్రమంగా ఆలోచించే పద్ధతిని, అందంగా, శక్తివంతంగా, అర్థవంతంగా మాట్లాడగలిగే సామర్థ్యాన్నీ, నైపుణ్యాన్నీ- ఎదుటివారి అభిప్రాయాలను సహనంతో వినే సహృదయాన్నీ, ఆలోచన రేకెత్తించి, వివేకాన్ని ఉద్దీపింప చేయగలిగే అధ్యయన శీలతనూ అలవరచేందుకు వివిధ దృక్కోణాలతో రూపొందించిన కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

యువభారతి కడచిన పదేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు, వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ఇంతవరకూ ఇరవైరెండు ప్రచురణలు ప్రచురించి లక్షయాభై వేలకు పైగా ప్రతులను తక్కువ వెలకు తెలుగు పాఠకుల కందజేయడం జరిగింది.

భారతదేశంలో ఎక్కడున్నా సరే - యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో ఇప్పటికి 7,000కు పైగా సహృదయులు చేరారు యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభించబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా దాదాపు 450 మంది, భారతీభూషణులుగా 45 మంది చేరారు.

ఉదాత్త భక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు. వారిసౌహార్ద్రం, భాషాప్రియత్వం, ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

ఇరివెంటి కృష్ణమూర్తి

[illegible] 1974 అధ్యక్షుడు

యువభారతి

7,000కు పైగా సహృదయులు
సాహితీమిత్రులుగా చేరారు.

10,000

సాహితీమిత్రులకు

సన్నిహితం కావాలని మా ధ్యేయం!




సాహితీమిత్రులు, భారతీమిత్రులు, భారతీభూషణులుగా చేరి
యువభారతి సాహిత్యోద్యమ నిర్వహణలో తోడ్పడండి!




1974 లహరి

# ప్రతిభాలహరి

ప్రతిభాలహరికై ఎన్నికైన ప్రతిభామూర్తులు

* శ్రీనాథుడు
* తెనాలి రామకృష్ణుడు
* పానుగంటి లక్ష్మీ నరసింహారావు
* కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ
* మహాకవి శ్రీశ్రీ

యువభారతి